

నా పల్లె పానాది
తొలకరి చినుకులకు
అటూ ఇటూ ఆకుపచ్చ చేతులెత్తి
రంగు రంగు పూల రవికల్ని తొడుగుతది.

*

కపట వేటగాని బాణాలకు
నేలకొరిగిన గొర్రెంకల చూపులకు
డాంబరు తోవలన్నీ ఇనుపకంచెలైనప్పుడు
పానాదులన్ని పాటలై నినాదాలై
అచ్చంతపూల బతుకుదండలై
ఆలింగనం చేసుకుంటాయి.



Md. AHMED poems PAANADI

# యండి. అహ్మద్

## కవితల

# పానాది



# యండి. అహ్మద్

## కవితల

# పునాది



మంజీరా రచయితల సంఘం
మెదక్ జిల్లా

**PAANADI**

*Collection of Poems*

*by*

**Md. AHMED**

*First Edition :* 11th November 2006

*Poet's Address*

H.No. 1-12-29/20, Ajay Nagar Colony, Medak-502 110.

*Cover Paintings:* **Akber**

*Cover Design:* **Sita,** Akshara Creators

*Publication*

**Manjeera Rachayitala Sangham**

Medak District.

*Copies available at*

**Visalandhra Book House,** Hyderabad and its branches in A.P.,
**Prajashakti Book House,** Chikkadpally, Hyd. & its branches in A.P.
**Navodaya Book House,** Badichowdi, Hyderabad,
**Disa Pustaka Kendram,** Chikkadpally, Hyderabad,
**Navodaya Publishing House,** Eluru Road, Vijayawada.

*Composed at*

**Akshara Creators,** AG-2, A-Block, Mathrusri Apts.,
Hyderguda, Hyderabad. Ph: 23244088

*Printed at*

**Charita Impressions,** Azamabad Industrial Area,
Hyderabad. Phones: 040-27678411, 55295078

Rs. **30.**

## అంకితం

కష్టాల కుంపటిలో కుమిలి
సుఖపడే వేళకు మాకు దూరమైన
అబ్బా **యండి. మూసాకు**

బతికినన్ని రోజులు మాకోసం
ఆరాపటడిన ఖాలా (చిన్నమ్మ)
**మహబూబీ** యాదిలో

# జీవితంలో కవిత్వం మొదటిది కావాలి

కె. శివారెడ్డి

రెండు దశాబ్దాలు. ఒక రెప్పపాటులో గడిచిపోయినట్టు- నిన్నగాక మొన్న మంజీరా రచయితల సంఘం ఆవిర్భవించినట్టు- యిరవై యేళ్లు ఎంత తొందరగా గడిచి పోయాయి. ఇరవై యేళ్ళ సంకుల సమరం తర్వాత వెనక్కి తిరిగి చూసుకుంటే, అదో అనుభూతి. ఈ ఇరవై యేళ్ళలో మంజీరా ప్రవాహం, దాని ప్రభావం; సామాజిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలపైననే కాకుండా వ్యక్తుల మీద కూడా. అన్ని రంగాల ప్రభావం మంజీర మీద, మంజీర ప్రభావం- దాని ఆవరణలో జీవిస్తున్న కవుల మీదా, రచయితల మీదా- కొత్త కవులు రావటానికి, పాత కవులు రాటుదేలటానికీ, పరిణామం చెంది ప్రసిద్ధి చెందటానికీ ఇది మార్గదర్శక మయ్యింది. కాలం, ప్రకృతి, సమాజం, సాహిత్యం ఒకదాన్ని మరొకటి ప్రభావితం చేసుకొంటూ, సమృద్ధిపరుచుకుంటూ ముందుకెడతాయి. ఈ యిరవై యేళ్ళ మంజీరా రచయితల సంఘం ప్రయాణంలో రెండుమూడు తరాలు బయటికి వచ్చాయి. కేంద్రీకృత స్థానంలో ఉన్న ఒక వ్యక్తి కానీ, ఒక సంస్థ కానీ ఒక తప్పించుకోలేని ప్రభావాన్ని ప్రసరింపజేస్తుంది. ఏమాత్రం సామాజిక బాధ్యత ఉన్నా, ఘటనలకీ, సందర్భాలకీ స్పందించే గుణం ఉన్నా, ఒక వ్యక్తి కళాకారుడిగానో, కవిగానో రూపొందాల్సిందే.

గత యిరవైయేళ్ళ తెలంగాణ రాజకీయ, సామాజిక జీవితం మామూలుగా లేదు. అనేక కల్లోలాలకీ, సంక్షుభితాలకీ, సంఘర్షణలకీ, పోరాటాలకీ అది నెలవ యింది. మామూలు వ్యక్తి దగ్గర నుంచి, చైతన్యశీలి అయిన కవి దాకా, అందరూ చలించి పోయి, ఆ సందర్భంలో భాగమయి, జీవితాన్ని అనుభవించారు.

నే చెబుతున్న ఈ ప్రభావాలకీ, మార్పులకీ లోనయి క్రియాశీలంగా ఉన్న వ్యక్తి అహ్మద్. ఈ పుస్తకంలోని కవితల్నిబట్టి చూస్తే, అహ్మద్ మంజీరాతో పుట్టి పెరుగుతున్న కవిగా కన్పడతాడు.



మంజీరా రచయితల సంఘం 1986లో ఏర్పడింది. అహ్మద్ కూడా- ఈ పుస్తకం ఆధారంగా- అప్పుడే జన్మించినట్టు కన్పడుతుంది. 1986 ముందు కవిత్వం రాశాడో లేదో తెలియదు. 1986 నుంచి 2006 దాకా రాసిన కవితలన్నీ యిందులో ఉన్నాయి. ఈ యిరవై యేళ్ళలో రాసింది ఈ కవితలేనా, అని అంటే, వడపోసి ఈ కవితల్ని మొదటిసారిగా పుస్తకంగా తెస్తున్నాడు. సందర్భం మంజీరా రచయితల ద్విదశాబ్ది ఉత్సవాలు. యిప్పటికైనా పుస్తకం తెస్తున్నందుకు నాకానందం. యిందులో 86 రాసినవి మూడు, 88లో రాసినవి రెండు- తర్వాత 96 దాకా కవిత లేదు. దరిదాపు ఒక దశాబ్ది- కారణం తెలియదు. ఆయా సంవత్సరాల్లో కవితలున్నా యిందులో చేర్చలేదా- అనేక కారణాల వల్ల ఆ సంవత్సరాల్లో రాయలేదా? 96లో ఒక కవిత, 97లో రెండు, 98లో రెండు, 99లో మూడు, 2000లో ఒకటి, 2002లో నాలుగు, 2004లో 8 కవితలు, 2005లో రెండు, 2006లో రెండు.

ఇది లెక్కల కోసం ఇస్తున్న పట్టిక కాదు. ఆయా సంవత్సరాల్లో ఆయా కవి ఎలా ఉన్నాడు, అతని సృజనశీలత ఎలా వుంది, ఆయా సంవత్సరాల్లో వేటివేటికి, ఏఏ సందర్భాల్లో స్పందించాడు అనేది అవసరం. జీవితం ఉంది, ప్రతి ఒక్కడికీ తనదయిన జీవితం ఉంది. వ్యక్తిగత, కౌటుంబిక జీవితం ఉంది. అది సామాజిక జీవితంతో పెనవేసుకుపోయి ఉంటుంది. ఒక్కొక్కసారి వ్యక్తిగత కౌటుంబిక జీవితం మోయలేనంత బరువై, చిక్కుముడుల్లో చిక్కుకొని విడివడలేక, ఊపిరాడక తన్నుకుంటున్న సందర్భంలో సృజన అసాధ్యమనిపిస్తుంది.

కానీ, ఆ స్థితిని సృజనగా మార్చే నేర్పు, సంయమనం ఏర్పర్చుకుంటే, కవిగానీ, రచయితగానీ ఆగడు. యిదంతా ఎందుకంటే అహ్మద్ 8 సంవత్సరాలు కవిత లేకుండా వున్నాడు. సరే కారణమేమయినా, ఆ స్థితిని వదిలేద్దాం. తర్వాత కొనసాగాడు. కవి కొనసాగాలి. తీగ సాగాలి, అల్లుకోవాలి, ఆవరించాలి. 88లో ఆగిపోకుండా కదులుతూ, 2006 దాకా యాత్ర చేశాడు. ఫలితం ఈ కవితా సంపుటి.

తెలంగాణలో జీవిస్తున్న కవికి అనేక పార్శ్వాలు, అనేక వారసత్వాలు. ముఖ్యంగా అతన్ని ఆవరించి ఉండేది, అంతర్లీనంగా ప్రవహించేది అతని పోరాట వారసత్వం. నిజాం వ్యతిరేక సాయుధ పోరాట వారసత్వం నక్సల్‌బరీతో మొదలయి శ్రీకాకుళం మీదుగా ఆదిలాబాదు గోదావరిలోయ పోరాటాలు, ఇప్పుడు నడుస్తున్న అనేక పోరాటాల దాకా అది విస్తరించింది. విశాలమయింది.

జీవితం సుఖంగా లేదు, భద్రంగానూ లేదు. అర్థం కాకుండా, అర్థమయినా నిస్సహాయంగా, ఏకాకిగా- అయితే అహ్మద్‌కి మరో కోణం అదనంగా, మరో

వేదన, మరో దుఃఖం వుంది. ఈ దేశంలో ముస్లిమ్‌లు అనుభవించే వేదన. చెప్పుకోలేని, లోలోపల మగ్గిపోతూ, అవమానపడుతూ కుమిలిపోతున్న దుఃఖం, బాధ. ఈ దేశంలో తమ జన్మభూమిలో పరాయివాడుగా, కాందిశీకుడుగా చూడబడటం- బతకటం.

వీటన్నిటికీ అహ్మద్ చలించాడు. తనదయిన పద్ధతిలో కవిత్వీకరించాడు.

గత మూడు నాలుగు దశాబ్దాల నుంచీ కొనసాగుతున్న భూ పోరాటాలు, ఉద్యమ విస్తృతి, పోలీసుల దాడులు నలిగిపోతున్న ఊళ్ళు, ప్రజల జీవితాలు- ఇది ఒక అంశం. బాల్యం- దానికి సంబంధించిన కవితలు.

మూడు- ప్రపంచీకరణ నేపథ్యంలో జీవితాలు, ఊళ్ళు, సంబంధాలు ఎలా రూపుదిద్దుకొటున్నాయి. నాలుగు- మతతత్వ దాడులు, హిందూ ఫాసిజం, ముస్లిం వేదన, బాబ్రీ మసీదు విధ్వంసం నుంచి, బొంబాయి, గుజరాతు మారణకాండ దాకా సాగిన హింస. ముస్లిమ్‌ల బాహిరాంతఃకరణాల వేదన- ఇలా నాలుగయిదు పాయలుగా విస్తరిల్లిన కవిత్వం. 86లో రాసిన కవిత- మౌనం.

నన్ను మౌనం అని తీసిపారేయకండి
మౌనంలోనే
అడవి అంతర్లీన చైతన్యం పెంచుకుంటుంది
మౌనంగా వున్న వెన్నెల ప్రచండాగ్ని కురిపిస్తుంది
రామచిలుకలు, పావురాలు కవాతు చేస్తాయి.

యింకో కవితలో-

జనం జీవితాలతో యుద్ధం చేస్తున్న
వాడూ, వీడూ
జనం కాళ్ళ కింద సమాధులౌతారు
భావక్షేత్రానికి అడ్డుకంచెలు వేస్తూ
తురాయిపూలు పూసే చోట పల్లేరులు చల్లుతున్నారు
గోడ మీద అక్షరాలు వేలవేల ఆలోచనలకు స్ఫూర్తినిస్తాయి
జనం జీవితాల మధ్యనే మన జీవితాలకు రక్షణ

(గోడ మీది అక్షరాలు)

ఎప్పుడో సంవత్సరం గుర్తు లేదు కానీ, ఖచ్చితంగా 80వ దశకం అయి వుంటుది. కరీంనగర్ మీటింగుకెళ్తే మాటల సందర్భంలో నిజాం వెంకటేశం ఒక మాటన్నాడు. 'యిద్దరు మనుషులు కలిసినప్పుడూ, మాట్లాడుకొంటున్నప్పుడూ, మూడో వ్యక్తి అజ్ఞాతంగా వుంటాడు- ఆ మూడో వ్యక్తి ఎవరో కాదు పార్టీయే,' అని. ఆ మాటలు



ఆనాడు నన్ను charge చేశాయి. ఒక పార్టీ ఏ రకంగా వుండాలో, ఏ రకంగా పని చేయాలో చూచాయాగా ఆ మాటలు తెలిపాయి. అంతేకాదు ప్రతి యిద్దరి వ్యక్తుల మధ్య అది అనుసంధానం- మౌలిక బంధనాలు నింపేది. నాకీ పంక్తులు చదివాక నిజాం వెంకటేశం మాటలు గుర్తుకు వచ్చాయి.

ఈ పోరాట నేపథ్యంలోనే మరో మంచి కవిత- తల్లిగోస.

పల్లెలో బతుకెళ్ళదీయటం
అన్యాయమైపోయింది
మమ్మల్ని యాడ బతకనీయరు,
మీ కొడుకేడని, యాడున్నాడని-
వాడు యాడున్నాడని సెప్పాలె

అక్కడ్నుంచి కవిత టేకాఫ్ చేస్తుంది.

ఊర పిసుకల గుంపులో పోయిండని సెప్పనా
పొలాల గట్ల మీద పచ్చిగడ్డి అయిండని సెప్పనా
వాగైనాడని సెప్పనా, వరదయినాడని సెప్పనా-

నైజాంవాడు గిట్లనే జేసిండు, నాశనమయిండు
మీరు గిట్లనే సేయవట్టిరి
మా గోస దాకి మట్టిగొట్టుకపోతరు
మా ఉసురు దాకి ఊడ్చుకు పోతరు-

జనపదాల సవ్వడులు, జనం పోరాట పాటలు కావాలి, యుద్ధాన్ని ఆపలేం. ఈ కవితలన్నీ ఆ దశని సూచించేవే. బాల్యానికి సంబంధించి రెండు కవితలూ మంచివే. ముఖ్యంగా ఏమనాలో నోరు రావటం లేదు. యిది పిల్లవాని స్వగతంగా వెలువడిన కవిత. చాలా మంచి కవిత.

మైనారిటీ, ముస్లిం నేపథ్యం నుంచి నాలుగైదు కవితలు. కన్నవారి బాగు కోసం, ఈ దేశపు తల్లివేరులో పాయలం, భయకంపిత పావురాలం, ఆనవాళ్ళు లేనివాళ్ళం, మేం నవాబులం కాము... యిత్యాదుల్లో ముస్లింల అస్తిత్వ వేదన, అభద్రత, అవమానం అమానవీయం- మొదలగు అంశాలు బలంగా చెప్పాడు. ఇసురుగాను, తీవ్రవేదనతోను, ఆగ్రహంతోను చెప్పాడు.

కాలం ఖడ్గం మీద కవితలో

సమస్త భూమండలానికి
కాలం ఖడ్గం మీద

శత్రువుగా నిలబడ్డవాన్ని
ఈ భూగోళంలో ఎక్కడ గాయమయినా
గాయపడేది నేనే

సెప్టెంబర్ పదకొండు వెంటాడుతూనే వుంది.

నా మతం ఆనవాళ్ళు
నా ఆర్థిక జీవనం
నా వంశక్రమం
నే పెంచుకున్న అందమయిన
స్వప్నాల పూలతోట
ధ్వంసం, ధ్వంసం-

నా ఉనికిని
నాకై నేను మార్చుకుని
కాషాయ తలపాగ చుట్టుకుని
నా రక్తాన్నే తిలకంగా చేసుకున్న-
నేను మార్చుకోలేని నా మర్మాంగమే
నా మరణమౌతుందని
నాకేం తెలుసు

ఈ నేపథ్యం నుంచి రాసిన నాలుగైదు కవితలూ చాలా బలమయినవి ఆర్తి నుంచీ, ఆవేదన నుంచీ బయటికి వచ్చాయి.

ప్రపంచీకరణ నేపథ్యంలో, సరళీకృత ఆర్థిక విధానంలో వస్తు సంస్కృతిలో, సామ్రాజ్యవాద సాసంస్కృతి దాడి నేపథ్యంలో అమెకానీ, బుష్షీకరణనీ నిరసిస్తూ రాసిన కవితలు మరోకోణాన్ని వెలికి తీస్తాయి. హిందూ ఫాసిస్టు శక్తులు కావచ్చు, అమెరికన్ ఫాసిస్టు దాడి కావచ్చు- రాజ్యహింస కావచ్చు- ఇవన్నీ ఒకే దానికున్న అనేక ముఖాలు. ఒకదానితో మరొకటి ముడివడి వున్నాయి. ఒక క్రూరహింసాపూరిత వాతావరణ ప్రతిఫలనాలు. సారాంశంలో అవి అప్రజాస్వామిక అమానవీయ అమానుష ముఖాలు.

యిప్పటి తెలంగాణ అస్తిత్వ ప్రాదేశిక పోరాటం- ఆధిపత్యం ఎన్నో రకాలుగా వుంటుంది. మత, ప్రాంత, లింగ, వర్గ, కుల సాంస్కృతిక, భాష, ఆచార వ్యవహారాలుగా- ఒక జాతి అత్యంత ప్రేమతో, అపురూపంగా చూసుకొనే అంశం, సంస్కృతి, రెండు భాష, మరో రకంగా భాషే ఆ ప్రాంతపు మనుషుల, బృందాల సంస్కృతి. దీని మీద ఆధిపత్యాన్ని, అవమానాన్ని సహించటం కష్టం. ఈ నేపథ్యం



నుంచి అహ్మద్ మంచి కవిత రాశాడు. దగాపడ్డ తెలంగాణను, ఏడిండ్ల కొక్క దీపం యిత్యాది కవితలు.

భూమి అంటే అస్తిత్వం అనే కవిత అహ్మద్ అన్ని అంశాల సారాంశంగా రూపొందింది.

భూమి
అధికారం, ఆధిపత్యాల యుద్ధోన్మాదం
సూది మొనంత భూమి యివ్వని
మహాభారత యుద్ధం

అన్ని పోరాటాలకు భూమి ప్రాతిపదికగా, మూలంగా సాగే ఈ కవిత, భూవిముక్తే సర్వ విముక్తులకు కారణమని సూచిస్తుంది.

భూమి అంటేనే అస్తిత్వం
అస్తిత్వ పునాదులకే నిరంతర యుద్ధం

భూమి
ఆదిమానవునికి ఆలంబనగా
ఆధునిక నాగరికతకు తొలిబాట
ఊరూరా ఎగిసిపడే భూ విముక్తి
పోరాట చేతుల్లో ఆయుధం
పేద ప్రజల స్వప్నాల రాజ్యాధికారం
ప్రజా ఉద్యమాలు ఎజండాల డిమాండ్లై
శతకోటి సూర్య కాంతుల వెలుగులలో
రెపరెపలాడుతున్న జెండా
భూమి

ఎట్టకేలకు అహ్మద్ పుస్తకం తెస్తున్నందుకు అభినందనలు. ఒక విషయం చెప్పి ముగిస్తా- అహ్మద్‌లో యింతటి సంచలనం ఉన్నదనీ, తీవ్రత, సంస్పందన ఉన్నదనీ నేను ఊహించలేదు. ఒక గొప్ప స్పష్టత వుంది. సంయమనం వుంది. అయితే అహ్మద్ కవిత్వాన్ని మొదటి ప్రేయసిగా స్వీకరించాలి. అది చాలా డిమాండ్స్ పెడుతుంది. తట్టుకోవాలి, తీర్చాలి.

అహ్మద్! చదవాలమ్మా- అధ్యయనం లేకుండా, అనుశీలన లేకుండా, మననం చేసుకోకుండా యితరుల కవిత్వాన్ని జీర్ణం చేసుకోకుండా- మనం బలవంతులం కాలేం. జీవితంలో మొదటిది కవిత్వం కావాలి.

*హైదరాబాద్, 27 అక్టోబర్ 2006*

# కవిత్వమే తోడు

## నందిని సిధారెడ్డి

కష్టాల మధ్య జీవించే మనిషిలో కొంత సృజనాత్మకత ఉంటుంది. అది ఎటు మళ్ళితే అటు శక్తిగా పరిఢవిల్లుతుంది. ఒకోసారి ఆ శక్తి కళామార్గం పట్టి అపూర్వ స్థితిని సంతరించుకోవచ్చు. కవిత్వం కూడా సరిగ్గా అట్లా పుడుతది. చుట్టూ మనుషుల మధ్య తనలాంటి చిరు ప్రపంచాల మధ్య కవికి కవికి కొత్త అస్తిత్వం చేకూర్చుతది. అంతమాత్రమే కాదు, కవిత్వం కష్టాల్ని మరిపించే బృహత్సాధనం. ఏ మనిషయినా కష్టాలు ముసిరి చుట్టుముట్టినప్పుడు తల్లడమల్లడమై తోడు కొరకు తపిస్తడు. మనుషులెవ్వరూ కానప్పుడు, పరిస్థితులేవీ సహకరించనప్పుడు తెగని ఆయాసంతో తప్పకుండా కవిత్వం గొప్ప తోడు. హృదయం కాని హృదయం. ఉద్వేగభరితమైన ఊరట. కష్టాల మధ్య ఉద్వేగంతో జీవించే మనిషి కవిత్వాన్ని ప్రేమిస్తాడు. అట్లా కష్టాల కొలిమి నుంచి అహ్మద్ కవిత్వాన్ని ప్రేమించినవాడు. కవిత్వాన్ని తోడుగా స్వీకరించిండు.

కడు పేదరికం అనుభవించిండు అహ్మద్. మెదక్‌లో కూరగాయల మార్కెట్ చిన్న డబ్బా. కష్టాలు మోసేతందుకే పుట్టినట్టున్న అమ్మానాన్నలు. నేను చూశాను ఆ గూడు. అచ్చం గుడిసె. సరుకుల్లేని డబ్బా. సాగీసాగని బ్యారం. అయిదారు పుస్తకాలు. ఒకటో రెండో కవిత్వంవి. అహ్మద్‌కి కవులంటే ఇష్టం. నాకు అహ్మదంటే మక్కువ. కష్టాలు ముసిరినపుడు ముదిరినపుడు అహ్మద్ తట్టుకోలేక దారులు గాలించిండు. చీకటి రాత్రులు చిక్కుదారులు సంచరించిండు. కవిత్వమే కాంతి వంతంగా ఆహ్వానించింది. తోడయి నిలిచింది. జీవితంలో నిలదొక్కుకోవటానికి ప్రయత్నించినంత కవిత్వంలో నిలదొక్కుకోవటానికి ప్రయత్నించకపోవచ్చు. కవిత్వాన్ని ప్రేమించటం నిజం. కవిత్వబలంతోనే కష్టాన్ని జయించింది నిజం. మంజీరా రచయితల సంఘంలో భాగమై మాతో కలిసి నడిచిండు. ఇప్పటికి తన కవితల పొదిని 'పానాది'కి తెస్తుండు. పానాది కష్టాల పునాది.



*నవాబుల మతమైనాం కానీ*
*నవాబులం కాలేకపోయినం*
*చిల్లులు పడ్డ బురఖాల చాటున*
*ఎముకల గూళ్ళైందుకుంటాయి*
*ధనకామాంధ షేకుల కబంధ విశ్వాసాల్లో*
*మా బిడ్డల మూల్గులెందుకుంటాయి*

పేదరికానికి మతం లేదంటారు. నిజమేనా? ప్రజాస్వామిక వ్యవస్థలో మతం పేరిట జరుగుతున్న అణిచివేత నిర్ధారించాలి కదా. లోపల కావొచ్చు, బయట కావొచ్చు. పేదరికం చుట్టూ కనిపించని గోడలు! నుదుటిమీద కనిపించని రాతలు! ఎక్కడివి మరి?

*మన ఒంటినిండా గాయాలు చేసి*
*మన శిరసుకు మైనారిటీ మేకు కొట్టి*
*నక్కజిత్తుల రాజకీయాలలో*
*పావుల మవుతున్నది మనమే కదా!*

అహ్మద్ వ్యక్తీకరణలో నిపుణత లేకపోవచ్చు. స్వరంలో తీవ్రత ఉన్నది. ఉద్వేగం ఉన్నది. స్వచ్ఛత ఉన్నది. కవిత్వానికి కావలసిన లక్షణాలు ప్రధానంగా ఇవే. ఇవేవీ సాధన వల్ల రావు. అనుభవంలోంచి ఉబుకుతయి. అహ్మద్ మైనారిటీల గురించే కాదు పేదవృత్తుల గురించీ ప్రతిస్పందించిండు. బిందెలకు, బకెట్లకు రంధ్రాలు పడితే అతికే వాళ్ళు వస్తారు. ఇది సంచారవృత్తి. బజార్లో పని కోసం అరుస్తారు. అలమటిస్తారు. వాళ్ళ గురించి రాసిండు కవి.

*చిల్లులు పడ్డ సూర్యుడి దర్శనం*
*వారి చీకటి బతుకుల్లో నిండు చంద్రుడు జల్లెడౌతాడు*
*ఊరవతలి చింతచెట్టు అద్దాల మేడవుతుంది*

వాళ్ళ వృత్తే చిల్లులు అతకడం. కానీ, తమ బతుకంతా చిల్లులే. సూర్యుడు కూడా చిల్లులు పడి కనిపిస్తాడు. చంద్రుడు కూడా మరిన్ని చిల్లులు పడి జల్లెడయిండట.

సీదాసాదాగా రాయటం అహ్మద్ తత్వం. తన మత ప్రజలదీ దీనస్థితే. తన చుట్టూ ఉన్న పని దొరకని ప్రజలదీ అదే స్థితి. తన ప్రాంతానిది కూడా అంతే. అభివృద్ధి అంటని విషాదం. పాలకులు మాత్రం బాహాటంగా ప్రకటించుకుంటరు. 'భారతదేశం వెలిగిపోతుంద'ని. బడాయిలు కొడుతరు. కవి తన ప్రాంతం సంగతి మాట్లాడుతుండు. పాలకుల రథయాత్ర అబద్ధ ప్రచారాన్ని కడిగిపోస్తున్నడు.

*మైనింగ్ కళ్ళద్దాల ఆటగాడ మోసగాడ*
*నీ గిల్లికజ్జాల రథయాత్రకు చెదలు పట్టా*

# కవిత్వమే తోడు

## నందిని సిధారెడ్డి

కష్టాల మధ్య జీవించే మనిషిలో కొంత సృజనాత్మకత ఉంటుంది. అది ఎటు మళ్ళితే అటు శక్తిగా పరిఢవిల్లుతుంది. ఒకోసారి ఆ శక్తి కళామార్గం పట్టి అపూర్వ స్థితిని సంతరించుకోవచ్చు. కవిత్వం కూడా సరిగ్గా అట్లా పుడుతది. చుట్టూ మనుషుల మధ్య తనలాంటి చిరు ప్రపంచాల మధ్య కవికి కవికి కొత్త అస్తిత్వం చేకూర్చుతది. అంతమాత్రమే కాదు, కవిత్వం కష్టాల్ని మరిపించే బృహత్సాధనం. ఏ మనిషయినా కష్టాలు ముసిరి చుట్టుముట్టినప్పుడు తల్లడమల్లడమై తోడు కొరకు తపిస్తడు. మనుషులెవ్వరూ కానప్పుడు, పరిస్థితులేవీ సహకరించనప్పుడు తెగని ఆయాసంతో తప్పకుండా కవిత్వం గొప్ప తోడు. హృదయం కాని హృదయం. ఉద్వేగభరితమైన ఊరట. కష్టాల మధ్య ఉద్వేగంతో జీవించే మనిషి కవిత్వాన్ని ప్రేమిస్తాడు. అట్లా కష్టాల కొలిమి నుంచి అహ్మద్ కవిత్వాన్ని ప్రేమించినవాడు. కవిత్వాన్ని తోడుగా స్వీకరించిండు.

కడు పేదరికం అనుభవించిండు అహ్మద్. మెదక్‌లో కూరగాయల మార్కెట్ చిన్న డబ్బా. కష్టాలు మోసేతందుకే పుట్టినట్టున్న అమ్మానాన్నలు. నేను చూశాను ఆ గూడు. అచ్చం గుడిసె. సరుకుల్లేని డబ్బా. సాగీసాగని బ్యారం. అయిదారు పుస్తకాలు. ఒకటో రెండో కవిత్వంవి. అహ్మద్‌కి కవులంటే ఇష్టం. నాకు అహ్మదంటే మక్కువ. కష్టాలు ముసిరినపుడు ముదిరినపుడు అహ్మద్ తట్టుకోలేక దారులు గాలించిండు. చీకటి రాత్రులు చిక్కుదారులు సంచరించిండు. కవిత్వమే కాంతి వంతంగా ఆహ్వానించింది. తోడయి నిలిచింది. జీవితంలో నిలదొక్కుకోవటానికి ప్రయత్నించినంత కవిత్వంలో నిలదొక్కుకోవటానికి ప్రయత్నించకపోవచ్చు. కవిత్వాన్ని ప్రేమించటం నిజం. కవిత్వబలంతోనే కష్టాన్ని జయించింది నిజం. మంజీరా రచయితల సంఘంలో భాగమై మాతో కలిసి నడిచిండు. ఇప్పటికి తన కవితల పాదిని 'పానాది'కి తెస్తుండు. పానాది కష్టాల పునాది.



*నవాబుల మతమైనాం కానీ*
*నవాబులం కాలేకపోయినం*
*చిల్లులు పడ్డ బురఖాల చాటున*
*ఎముకల గూళ్ళెందుకుంటాయి*
*ధనకామాంధ షేకుల కబంధ విశ్వాసాల్లో*
*మా బిడ్డల మూల్గులెందుకుంటాయి*

పేదరికానికి మతం లేదంటారు. నిజమేనా? ప్రజాస్వామిక వ్యవస్థలో మతం పేరిట జరుగుతున్న అణిచివేత నిర్ధారించాలి కదా. లోపల కావొచ్చు, బయట కావొచ్చు. పేదరికం చుట్టూ కనిపించని గోడలు! నుదుటిమీద కనిపించని రాతలు! ఎక్కడివి మరి?

*మన ఒంటినిండా గాయాలు చేసి*
*మన శిరసుకు మైనారిటీ మేకు కొట్టి*
*నక్కజిత్తుల రాజకీయాలలో*
*పావుల మవుతున్నది మనమే కదా!*

అహ్మద్ వ్యక్తీకరణలో నిపుణత లేకపోవచ్చు. స్వరంలో తీవ్రత ఉన్నది. ఉద్వేగం ఉన్నది. స్వచ్ఛత ఉన్నది. కవిత్వానికి కావలసిన లక్షణాలు ప్రధానంగా ఇవే. ఇవేవీ సాధన వల్ల రావు. అనుభవంలోంచి ఉబుకుతయి. అహ్మద్ మైనారిటీల గురించే కాదు పేదవృత్తుల గురించీ ప్రతిస్పందించిండు. బిందెలకు, బకెట్లకు రంధ్రాలు పడితే అతికే వాళ్ళు వస్తారు. ఇది సంచారవృత్తి. బజార్లో పని కోసం అరుస్తారు. అలమటిస్తారు. వాళ్ళ గురించి రాసిండు కవి.

*చిల్లులు పడ్డ సూర్యుడి దర్శనం*
*వారి చీకటి బతుకుల్లో నిండు చంద్రుడు జల్లెడౌతాడు*
*ఊరవతలి చింతచెట్టు అద్దాల మేడవుతుంది*

వాళ్ళ వృత్తే చిల్లులు అతకడం. కానీ, తమ బతుకంతా చిల్లులే. సూర్యుడు కూడా చిల్లులు పడి కనిపిస్తాడు. చంద్రుడు కూడా మరిన్ని చిల్లులు పడి జల్లెడయిండట.

సీదాసాదాగా రాయటం అహ్మద్ తత్వం. తన మత ప్రజలదీ దీనస్థితే. తన చుట్టూ ఉన్న పని దొరకని ప్రజలదీ అదే స్థితి. తన ప్రాంతానిది కూడా అంతే. అభివృద్ధి అంటని విషాదం. పాలకులు మాత్రం బాహాటంగా ప్రకటించుకుంటరు. 'భారతదేశం వెలిగిపోతుంద'ని. బడాయిలు కొడుతరు. కవి తన ప్రాంతం సంగతి మాట్లాడుతుండు. పాలకుల రథయాత్ర అబద్ధ ప్రచారాన్ని కడిగిపోస్తున్నడు.

*షైనింగ్ కళ్ళద్దాల ఆటగాడ మోసగాడ*
*నీ గిల్లికజ్జాల రథయాత్రకు చెదలు పట్టా*

*నా తెలంగాణ పాదాల కాడ నిలబడి చూడు*
*నెర్రెలుబారిన భూతల్లి ఎదలనడుగు*
*దూప దీరని పాలపిట్టల నడుగు*
*గడ్డి మొలవని చెలకల నడుగు*
*అభివృద్ధి అంచుకు వేళ్ళాడుతున్న ఆత్మహత్యల నడుగు*
*భారత్ వెలిగిపోతుందా? హీ హీ హీ...*

అని వెక్కిరిస్తున్నడు.

నిస్సిగ్గుగా ఉంటున్నది రాజకీయం. అంతా చూస్తుంటరు. జరుగుతున్నదేమిటో తెలుసు. దబాయించి ప్రచారహోరు! విచిత్రమేమంటే అధికారం కోల్పోతే అన్నీ ప్రశ్నిస్తరు. అధికారంలకు రాంగనే అన్నీ కప్పేస్తరు. లేనిది ఉన్నట్టు ఉన్నది లేనట్లు స్థిరపర్చటానికి సర్వశక్తులు ఒడ్డుతరు. తెలంగాణ పరిస్థితి తేటతెల్లమవుతుంటే అహ్మద్ సర్కారును నిలదీస్తున్నడు.

తెలంగాణ విద్యార్థిది కూడా విషాదమే. అహ్మద్ ఉపాధ్యాయుడుగా ఉంటూనే విద్యార్థుల సమస్య పట్టించుకున్నడు. కరెంటుకోత రైతులకే కాదు విద్యార్థికీ కన్నీళ్ళు తెప్పిస్తున్నది. ఎండాకాలం. విద్యార్థుల పరీక్షల సమయం. పరీక్షల దినాల్లోనైనా నిరంతరంగా కరెంటు సరఫరా చేయాలని మెదక్ పాఠశాలల విద్యార్థులు అదీ ఆరు, ఏడు తరగతుల చిన్నారులు శాంతియుతంగా ఒక ర్యాలీ నిర్వహించారు. అన్నిటికీ సర్కారు సమాధానం ఒక్కటే. పోలీసు బలం. చిన్నపిల్లల మీద లాఠీఛార్జి ప్రయోగించిండ్రు. చాలమంది ఉరకలేక మోరీలల్ల పడిపోయినారు. సర్కారు దంచుడుకు గాయపడిపోయారు. అహ్మద్ చలించి కవిత్వం చేసిండు.

*మేం చదువుకుందామంటే*
*మీవాళ్ళే వెలుతురు మింగారు కదా సార్*
*చదువుకునెటందుకు వెల్తురు అడిగామే తప్ప*
*మాకు ఏ పాపం తెలవదు*
*మాష్టారు కొనవేళ్ళ తాకిడికే బెదిరిపోయే వాళ్ళం*
*ఇప్పుడే వికసించే లేలేత గులాబిమొగ్గలం*
*మమ్మల్ని ఎందుక్కొడుతున్నరు*

ఒకపక్కన చదువుకొమ్మని ఆర్భాటంగా ప్రచారం చేస్తరు. చదువు పేరుతో కోట్లు మింగుతరు. కరెంటు భారీ పరిశ్రమలకు మళ్ళించి దండుకుంటరు. చివరకు కనీస కోరిక అని చూడకుండా పిల్లలనే జాలి కూడా లేకుండా తోముతరు. పాలన అంటే అర్థమిదే అవుతున్నది. కవిది ధర్మాగ్రహం. ధర్మం వైపు నిలబడి నిరంతరం కవి స్వరం వాదిస్తది.



*ఢిల్లీ నగరానికి దిగులు లేదు*
*భాగ్యనగరానికి బాధ లేదు*
*బీటలు బారిన భూహృదయం*
*సెగలు కక్కుతుంది*

భూమి హృదయాన్ని అందుకున్న కవి అహ్మద్. రగులుతున్న నిప్పుకణికెల మధ్య నుంచి, 'సెగ'ను ఆవిష్కరించాడు.

మెదక్‌ను అల్లుకొని, సింగారంగా ప్రవహించే పసుపేరు ఎండిపోయి, 'కత్తులపై సేదదీరిన పసిపాప'లా ఉందని విదారకత్వాన్ని చిత్రించాడు. యుద్ధోన్మాదంతో పేద దేశాల మీద పెత్తనం చేస్తున్న అమెరికా సామ్రాజ్యవాదాన్ని తూర్పారపట్టిండు.

కవిగా అహ్మద్ స్పందనలన్నీ కలిపి, 'పానాది.' కష్టమెరిగిన కవి. కన్నీరెరిగిన కవి గనుక అహ్మద్ నాకిష్టం. రాబోయే కాలానికి అహ్మద్ మరింత కవిత్వం మరింత మంచి కవిత్వం రాయాలని- నిజాయితీ ఒక్కటే సరిపోదు నిపుణమైన అక్షరాలు అల్లుతాడని- ఆశిస్తాను.

యుద్ధమైనా కవిత్వమైనా చతురత్వంతో నిర్వహించాల్సిన సందర్భం. సందర్భాన్ని మనసుకు తట్టించుకుంటాడని విశ్వసిస్తూ అహ్మద్ కవిత్వాన్ని అలాయ్‌బలయ్ తీసుకుంటున్నా.

*29 అక్టోబర్ 2006*
*మంజీరా రచయితల సంఘం ఇరవైయేండ్ల సభల సందర్భం, సిద్దిపేట*

# ఈ భూమి మనందరిది

*జూలూరు గౌరీశంకర్*

అసలు కవిత్వమెందుకు రాయాలి?

కవిత్వమే ఎందుకు రాయాలి?

మట్టిని పిసికే చేతులతోనే మహాద్భుతాలు సృష్టించబడ్డాయి.

మట్టి నుంచి మనిషిని వేరుచేసి చూడలేం.

ఈ జీవిక వల్ల ఏం జరగాలనుకున్నప్పుడు ఒక్కసారిగా మనలో కోటానుకోట్ల రసాయనిక చర్యలు జరుగుతాయి.

మనిషెందుకు చనిపోతున్నాడు లేదా చంపబడుతున్నాడు. కొందరు వేటాడబడు తున్నారు. కొందరు రాజ్యముద్రలతో వధింపబడుతున్నారు. దేనికోసం?

కొందరు కోట్లు గడిస్తున్నారు. కోటలు కట్టుకుంటున్నారు. ఊర్లను కొంటున్నారు. దేశాల్ని కొనేస్తున్నారు. వినకపోతే బలవంతంగా లాగేసుకుంటున్నారు. ఎందుకోసం?

ఊళ్ళు నిర్జీవంగా చేయబడుతున్నాయి. సహజ చెరువులను చంపేస్తున్నారు. సంతలు మాయమవుతున్నాయి. మన పాటల్ని, కళల్ని, సాహిత్యాన్ని కనుమరుగు చేసేస్తున్నారు. ఇదంతా ప్రపంచీకరణ మాయ.

దీన్ని మొత్తాన్ని కవిత్వం చేయటం అంత సులభం కాదు. ఇందుకు బాధ ఉండాలి, కసి ఉండాలి. కనుగుడ్లల్లో ఉబికిన నీళ్ళుండాలి. గుండె తడి ఉండాలి. ఇవన్నీ ఎవరి దగ్గరుంటాయో అక్కడ కవిత్వం ఉంటుంది. ఈ పానాది పుస్తకంలో ఆ భావనల కవిత్వం ఉంది. అహ్మద్ జీవితం నుంచి వచ్చిన నేల కవి.

మంజీరా రచయితల సంఘమే ఒక తెలంగాణ సాహిత్య ఖజానా.

ఈ సంఘం ఆచరణాత్మకమైనది, ఆలోచించేది, స్పందించేది సమాజ వికాసం కోసమేనని రుజువు చేసుకుంది. ఈ సంఘపు చెట్టుకు విరగకాసిన ఒక పువ్వు యండి. అహ్మద్.



మంజీరా రచయితల సంఘం చెట్టుకు పాదుచేసి నీళ్ళు పోసి పెంచుతున్న నందిని సిధారెడ్డి భూమి స్వప్నమైతే, ఈ అహ్మద్ కవిత్వపాయ పానాది.

తన నేల మీద తాను గీసుకున్న అనుభవాల గీతలే ఈ పానాది.

ఇది మా భూమి.

మన భూమి.

మనందరి భూమి.

దీన్ని కవిత్వంగా పలవరిస్తున్న కవి అహ్మద్. ఈ మట్టి గీతల్ని మీటండి. వెనకబడ్డ నేలపాటను వినండి.

*హైదరాబాద్, 24 అక్టోబర్ 2006*

## జ్ఞాపకాల పొరల్లోంచి...

### యండి. అహ్మద్

పారేసుకున్న బాల్యం
పొయ్యి మీద రొట్టెపెంకైతె
ఎదిగిన జీవితపు మనాదిలో
నిద్రకు రెక్కలొచ్చిన రాత్రుళ్ళు ఎన్నో

ఆ పరిస్థితులు అంతే నాలాంటివారికి మినహాయింపు కాదు. ఆ నేపథ్యమే పురి విప్పిన ఆలోచనల కెరటాలలో ఒకడినైనాను. మెదక్‌లో డిగ్రీ చదువుతున్న రోజుల్లోనే తెలుగు లెక్చరర్‌గా పరిచయమైన నందిని సిధారెడ్డి సార్, 'మెదక్ స్టడీ సర్కిల్' ఏర్పాటు, ఆ సమావేశాలు నా ఆలోచనలకు కవితలుగా పదునెక్కినాయి. ఎన్నో సామాజిక విషయాలు, సమకాలీన కవిత్వ ధోరణులపై సిధారెడ్డి సార్ ఇంట్లో జరిగిన చర్చలు ఇంకా జ్ఞాపకాల తరంగాలై మెదులుతూనే ఉంటాయి. సార్ ప్రభావమే నా కవితల నావకు తెరచాప అయితే జీవితంలో నిలదొక్కుకోవడానికి తొలిమెట్టుగా ఆసరా అయింది కూడా సారే. మరొక సాహితీ మిత్రుడు నూతి లక్ష్మణ్‌గారు.

మెదక్ స్టడీ సర్కిల్ 'మంజీరా రచయితల సంఘం'గా ఏర్పడిన తరువాత మంజీరాలో నేను ఒక పిల్లకాలువనై నేటికీ పారుతూ నా ఉనికి, 'మరసం' అయి సజీవ పాయగా మీ ముందున్నాను. 'నా పుస్తకం వేస్తాను సార్,' అనగానే, సంతోషంతో ప్రోత్సహించి పుస్తకంగా రావడానికి సహకారం అందించి ఆత్మీయంగా ముందుమాట రాసిన నందిని సిధారెడ్డిగారికి కృతజ్ఞతలు.

జీవితంలో మలిమెట్టు ఎక్కడానికి (బి.ఇడి) చేయడానికి మార్గం చూపి, కవితా రచనలను ప్రోత్సహించిన మంచి మనసున్న బి. కొండల్‌రెడ్డి (ఎ.పి.టి.ఎఫ్.) గారికి కృతజ్ఞతలు.



మెదక్ స్టడీ సర్కిల్‌లో పరిచయమై ఇప్పటివరకు, 'అహ్మద్' అంటూ ఆప్యాయంగా దగ్గరకు తీసుకొనే కవి, కేంద్ర సాహిత్య అవార్డు గ్రహీత కె. శివారెడ్డిగారు మంచి మనసుతో ముందుమాట రాసినందుకు ప్రత్యేక ధన్యవాదములు.

అడగగానే మంచి మనసుతో ముందుమాట రాసిన, 'పాక్కిలి' సంకలనకర్త, కవి మిత్రుడు జూలూరి గౌరీశంకర్‌గారికి ధన్యవాదములు.

ప్రత్యేక శ్రద్ధ తీసుకొని ముద్రణభారాన్ని ఆప్యాయంగా స్వీకరించి పుస్తకం చక్కగా రావడానికి సహకరించిన వాసిరెడ్డి నవీన్‌గారికి ప్రత్యేక ధన్యవాదములు.

నా కవితా రచనలను ప్రోత్సహించిన సీనియర్ మంజీర కవిమిత్రుడు ఏలేశ్వర నాగభూషణాచార్య, ఇతర మంజీర మిత్రులకు, ఎ.పి.టి.ఎఫ్. మిత్రులకు ధన్యవాదములు.

కలిసినప్పుడల్లా, 'మంచి కవితలు రాయాలి,' అని చెప్పే కవి మిత్రుడు నాళేశ్వరం శంకరంగారికి, ముస్లిం మైనారిటీ సమస్యలపై కవితలు రాయమని ప్రోత్సహించిన కవి మిత్రుడు స్కైబాబాకు ధన్యవాదములు.

వయస్సులో పెద్దవాడైనప్పటికి మిత్రునిగా మాటల దొంతరులైన కీ॥శే॥ ఆకుల నర్సింలుగారి యాదిలో దినపత్రికలలో వచ్చిన కవితల కటింగులిచ్చిన బాల్య మిత్రుడు ఆకుల రాంకిషన్, వారి కుటుంబసభ్యులకు ధన్యవాదములు.

నా కవితలను ప్రసారం చేసిన ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంవారికి, నా కవితలను అచ్చువేసిన *నేటినిజం*, చినుకు, *మంజీర, ముల్కి*, ఉషాకిరణాలు, *సోయి*, ప్రజాసాహితి, ఉపాధ్యాయ సంపాదకులకు, ఎడపాయల, *గుజారాత్ గాయం, పాక్కిలి, అజాం, అలావా, ఖిబ్లా, కవితా-2005*, విశాఖపట్టణం సంకలనకర్తలకు ధన్యవాదములు.

అందంగా ముఖచిత్రం వేసిన చిత్రకారుడు అక్బర్‌గారికి, అక్షరాలను పొందికగా చేసి, కవర్ పేజీ డిజైన్ చేసిన సీతగారికి, అచ్చువేసిన చరిత్రా ప్రింటర్స్ యాజమాన్యానికి ధన్యవాదములు.

జన్మనిచ్చిన అమ్మీ-అబ్బాలకు, చిత్తుగా రాసిన అక్షరాలకు మొదటి పాఠకురాలైన అందమైన అక్షరాలకు చెక్కనమైన సహచరిణి మహమూదాకు, కుమార్తె తారీఖ తబస్సుమ్‌కు ఆత్మీయతాభినందనలు.

*23 అక్టోబర్ 2006*

# మౌనం

నన్ను మౌనం అని తీసిపారేయకండి
నేను అణువణువులో అణుశక్తినై ఉంటాను
పల్లెల్లో, పొలాల్లో, అడవుల్లో రగిలే లావానై ఉంటాను

నన్ను మౌనం అని తీసిపారేయకండి.
అడవిలో చెట్లు చేమలు
మౌనంగానే ఉ ంటాయి
వెన్నెల అమాయకంగా
మౌనంగానే ఉంటుంది
గలగలా సెలయేర్లు
చల్లగా పారుతాయి
కానీ

గండుతుమ్మెదల దండు అడవిలో కాలుపెట్టి
అడవిమల్లెలను రాల్చినపుడు
మౌనం ఛేదించుకొని
అణుశక్తిగా మారుతుంది



'మౌనం'లోనే
అడవి అంతర్లీన చైతన్యం పెంచుకొంటుంది
మౌనంగా ఉన్న చెట్లు చేమలు గర్జిస్తాయి
మౌనంగా ఉన్న వెన్నెల ప్రచండాగ్నిని కురిపిస్తుంది
అడవిలోని సెలయేర్లు సైరన్లు ఊదుతాయి
రామచిలుకలు, పావురాలు కవాతు చేస్తాయి.

*మరసం, 'కదలిక' మెదక్‌జిల్లా కవుల సంకలనం, ఆగస్టు 1986*




# మార్పు

స్టార్‌వార్స్ వలలో చిక్కి
ఆకాశం ఒంటరిగా రోదిస్తుంది
నిశ్చల విశ్రాంతరాళంలో
దురాక్రమణ కబంధ హస్తాలపై
మఖ్‌మల్ పరిచిన పడక మీద
పుడమితల్లి పురిటినొప్పులు పడుతుంది.
శాంతి...

హిందూ మహాసముద్రంలో
నీటిబుడగలై ఈదుతుంది
ఉన్మాద సామ్రాజ్యవాద లోహతీగలు
శాంతి పావురానికి ఉచ్చులు బిగిస్తున్నాయి

ఆకాశం ఒంటరి కాదని
పిల్లగాలులు తుంపర్లు తుంపర్లుగా
తంతులు అందిస్తున్నాయి
సూర్యచంద్రగ్రహ నక్షత్రాలు మేల్కొని



దిక్కుల్ని దిగ్బంధం చేస్తున్నాయి
మేఘాల స్పర్శలో భూమి పులకించి
కడలి తరంగాలను తట్టి లేపుతుంది
కడలి కట్టల్ని తెంచుకొని
చురకత్తుల స్వారీ చేస్తుంది.

*'చినుకు' సాహిత్యపత్రిక, 14 సెప్టెంబర్ 1986*



# రాబందుల నాట్యం

**మూ**డు పూలు
ఆరుకాయల పాలనలో
అన్నీ ఆకలిచావులే...
అయినా...

ఢిల్లీ నగరానికి దిగులు లేదు
భాగ్యనగరానికి బాధ లేదు
కరువు రక్కసి కోరల్లో చిక్కి
పేదరైతుల పేగులు ఆకలిగానం ఆలపిస్తున్నా
తడి ఆరిన పొలాల గుండెలు
రక్తధారలు కారుస్తూ
గుక్కెడు నీళ్ళు లేక, బుక్కెడు బువ్వలేక
అనాథ ప్రాణాలు
ప్రకృతి పాడె మీద శవాలుగా మారుతున్నాయి.
శవాలకు స్వాగతం పలుకుతూ
రాబందులు నాట్యం చేస్తున్నాయి

ఆకలి అనుభవాల్ని
వింతగా, విడ్డూరంగా, విషాదంగా
సమాధులు ప్రసంగిస్తున్నాయి

ఈ సుభిక్ష పాలనలో?
ఆకలి అంటూ లేదని
అంతా అమృతం త్రాగిన చిరంజీవులని
పీతిరి గద్దలు పర్యటనలు చేస్తున్నాయి
ముప్పూటలా పంచభక్ష పరమాన్నాలు
మేసేవాడికేం తెలుసు? ఆకలి కేకలు
మెత్తని డన్‌లప్ పరుపులకేం తెలుసు
కుక్కి మంచాల బతుకులు

బక్కచిక్కిన కళేబరాల ఓట్లు తప్ప
అయినా...
ఢిల్లీ నగరానికి దిగులు లేదు
భాగ్యనగరానికి బాధ లేదు
బీటలు బారిన భూమి హృదయం
సెగలు కక్కుతుంది

*19 సెప్టెంబర్ 1986*



# ఇక్కడ అంతా యుద్ధమయమే

**యు**ద్ధం! యుద్ధం!! యుద్ధం!!!
అంతా యుద్ధమయమే
ఈ యుద్ధం జనం మధ్య కాదు
తిండి, బట్ట, గూడు కోసం కాదు
రాచపీనుగుల మధ్య
రాజ్యాల కోసం యుద్ధం
చమురుచుక్కల కోసం
రక్తం రుచి మరిగిన
సామ్రాజ్యవాదుల ఎత్తుగడల యుద్ధం
ఆధిపత్యం కోసం
బాలల భవిష్యత్‌తో యుద్ధం
కన్నతల్లుల పేగులు తెంపే
పసికందుల చిరునవ్వులపై
కర్కశ బాంబుల యుద్ధం
యుద్ధం అక్కడకాదు

ఇక్కడ అంతా యుద్ధమయమే
రెండు మతపిశాచులు కూడబలుక్కున్న యుద్ధం
మనిషి అన్న మమకారం లేక
కత్తులు దూసుకుంటున్న యుద్ధం
జనంతో, గాలితో
నీటిచెలిమలతో, అడవి పొత్తిళ్ళలో
గ్రామాలతో, జనం జీవితాలతో
పాటల మీద
పొలాల మీద
ఫ్యాక్టరీల మీద
ప్రజల కోసం ప్రాణాలిచ్చిన జ్ఞాపకాల మీద
యుద్ధం! యుద్ధం!! యుద్ధం!!!
జనం జీవితాలతో యుద్ధం చేస్తున్న
వాడు వీడు
జనం కాళ్ళ కింద సమాధులౌతారు.

*మరసం, 'కదలిక' మెదక్ జిల్లా కవుల సంకలనం, ఆగస్టు 1986*



# గోడ మీది అక్షరాలు

ఈ దేశపటం మీద
విష గిటారులు
తన పంజాలు పరుస్తున్న వేళ
పరస్పర భావాల్ని గాలికి వదిలి
అక్షరాలు అక్షరాన్ని ఈసడించుకుంటున్నాయి
ఈ వలయాల్లో ఊపిరి పీల్చడం కష్టంగా ఉంది
జీవిత వైరుధ్యాలను చూడడం
జీవితం రెండోవైపున ఆలోచించడం నేరమైతే
ఆకాశంలో ఊపిర్లు తోడుకోవాల్సి వస్తుంది.
నమ్ముకున్న నయనాలు
కాలం నియంతతో పోటీపడి కత్తులు విసురుతున్నాయి
భావక్షేత్రానికి అడ్డు కంచెలు వేస్తూ
తురాయిలు పూసేచోట పల్లేర్లు చల్లుతున్నారు
నిశ్శబ్దాల్ని ఛేదించి
శబ్దాల గొంతుకలు విప్పితే

నీకు...
బధిరుల భాషగా వినిపిస్తుందేమో
చౌరస్తాలో వేసే కేక
క్షణంపాటు తరంగాలతో అంతమైపోతుంది గానీ
గోడ మీద అక్షరాలు వేలవేల ఆలోచనలకు స్ఫూర్తినిస్తాయి
సంక్షోభ గందరగోళ యంత్రంలో
సేఫ్టీలాకర్ లైఫ్‌కు కూడ గ్యారంటీ లేదు.
జనం జీవితాల మధ్యనే మన జీవితాలకు రక్షణ

*'మంజీర' సాహిత్య పత్రిక, మే 1988*



# ఏమనాలో నోరు రావడం లేదు

మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
మీవారేగా అంటున్నారు
నేటి బాలలే
రేపటి భావిభారత పౌరులని
టి.వి.లలో రేడియోలలో పత్రికల నిండా
చొల్లు కబుర్లు గుప్పిస్తున్నారు కదా సార్!
మేం చదువుకుందామంటే
వెలుతురు మీవాళ్ళే మింగారు కదా సార్
మమ్మల్ని పట్టించుకోని
ఈ వ్యవస్థలో
మేం బ్రతకడం మా తప్పు కాదు.
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్!
చదువుకునేందుకు
వెలుతురు అడిగామే తప్ప
మాకు ఏ పాపం తెలువదు

పోలీసు జులుం నశించాలి అనలేదు
ఈ ప్రభుత్వం పాపిష్టిది అనలేదు
ప్రభుత్వాలను కూల్చడానికి కుట్రను చేయలేదు
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్
మా తరగతి గదిలో
మా మాష్టారు కొనవేళ్ళ తాకిడికే
బెదిరిపోయేవాళ్ళం
ఇప్పుడే వికసించే
లేలేత గులాబి మొగ్గలం
మమ్మల్ని ఎందుకు కొడ్తున్నారు సార్!
మీ అక్షరప్రభ బాకాలకు మేము కావాలి
మీ జెండాలకు జేజేలు కొట్టడానికి మేము కావాలి
మంత్రులకు, ప్రధానులకు
సలాములు కొట్టడానికి
రోడ్లపై బారులు తీర్చడానికి మేము కావాలి.
మీ వాళ్ళే కదా సార్
మమ్మల్ని రోడ్లపైకి తెచ్చింది
తెలిసీ తెలియనితనంతో
మాకు వెలుతురు కావాలని వచ్చాం కానీ
మా వీపుల మీద మీ లాఠీల
రాజ్యాన్ని ఊహించలేదు సార్
జనారణ్యంలో లేడిపిల్లలను
వేటాడడం చూపించారు కదా సార్
రక్షకభటులు అంటే
మనల్ని మన సమాజాన్ని రక్షించేవారని
మా మాష్టారు చెబితే





మురిసిపోయి జేజేలు కొట్టాం
ఇప్పుడు తెలిసింది సార్
మీరు ఎవరిని రక్షిస్తారో
మా చిన్నచిన్న మెదళ్ళకు అనుభవమైంది
అందుకే మిమ్మల్ని ఏమనాలో
మాకు నోరు రావడం లేదు.

*మంజీర కవుల సంకలనం 'ఎడపాయలు', 17 ఆగస్టు 1995*



# మేము సమస్త ప్రపంచమైనపుడు

మమ్మల్ని
మా మట్టిని మా బతుకుల్ని వేరు చేశారు
మాయమాటల మంత్రాలతో
మా రక్తమాంసాలను నంజుక తిన్నారు
సమాజ శ్రమకు మేము మూలమైతే
మా నరాలను తెంచి జంజాలు వేసుకున్నారు
కుట్రల కుతంత్రాలతో
మీ కల్లబొల్లి శాస్త్రాలతో
మా కళ్ళల్లో మేకులు దించారు.
మీ గుట్టు రట్టవుతుందని
మా చెవుల్లో సీసం పోశారు
మమ్మల్ని వెలివాళ్ళను చేసి
చంకలు గుద్దుకున్నారు.
అడ్డబట్ట కట్టుకొని
'హరిజనులు' అని ముద్దుపేరు పెట్టి





మాకు బట్టలు లేకుండా చేసిన భాగోతం తెల్సు
మీ కుట్రలకు బలై
మా చేతివ్రేళ్ళు కోసి ఇవ్వడానికి
ఏకలవ్యులం కాము
మీ అధికార దాహానికి ఆహుతైన
శంబూకులం కాదు
మేము సమస్త ప్రపంచమైనపుడు
మేము భూమ్యాకాశాలు అయినపుడు
మీ ఉనికి ఎక్కడిది?
భూతల్లికి సహనం ఉందో లేదో కాని
మా సహనం చచ్చి చాటింపు వేస్తున్నాం
మా గుండెను చీల్చి
బాధల దండోరా వేస్తున్నాం
ఇప్పుడు మా చేతుల్లో
పదునెక్కిన ఆరె, రంపం, కత్తులున్నాయి
వెలివేసిన వెలివాడలు ఏకం అయి
బాధలతో కుమిలిపోయిన కన్నీళ్ళు
ఉప్పెనలై పొంగుతున్నాయి కాచుకోండి
చీరిన వారెలు మీ ఉరితాళ్ళవటానికి
ఎగిరిపడుతున్నాయి

*10 ఏప్రిల్ 1997*



# తల్లి గోస

పల్లెల్లో బతుకెళ్ళదీయడం
అన్యాయమైపోయింది
మమ్మల్ని యాడ బతకనీయరు
మా బతుకుల్ని మాకుగాకుండా సేయవట్టిరి
మీ కొడుకేడని, యాడున్నాడని
మా కుండల్ని బజార్ల ఏయవట్టిరి
మా ఇండ్లను కాలబెట్టవట్టిరి - తాళాలు ఏయవట్టిరి
పల్లెల్లో బతుకెళ్ళదీయడం
అన్యాయమైపోయింది
కంటికి కునుకు లేకపాయే
కుండల ఎసరు లేకపాయే
రాబందుల దండు ఎప్పుడస్తదో
ఎవరి ఈపుల మీద
పల్లేరుగాయలు పర్చుకుంటాయో తెల్వదాయే
మాయి దినం దినం గండం బతుకులాయే



మా బతుకులు అరవందమాయే
కొడుకులను అప్పజెప్పుమని
మమ్ములను ఆగం-ఆగం సెయ్యవట్టిరి
వాడు యాడున్నడని సెప్పాలే
ఊరపిసుకల గుంపులో పోయిండని సెప్పనా
పొలాల గట్ల మీద పచ్చిగడ్డి అయిండని సెప్పనా
వాగైనాడని సెప్పనా - వరదైనాడని సెప్పనా
బతుకుదెరువుకు బొంబాయి పోయినాడని సెప్పనా
మా కన్నపేగుల్ని కోసేయవట్టిరి
మా కడుపును మమ్మల్నే పొడుసుకోమంటిరి
బాధలతోటి బతుకులెల్లదీసినోళ్ళం
మాకివేమి కొత్తగాదు
తెల్లోడు గిట్లనే జేసిండు నాశనమైండు
నైజాంవోడు గిట్లనే జేసిండు
వాడు నాశనమైండు
మీరు గిట్లనే సేయవట్టిరి
మా గోస దాకి మట్టిగొట్టుకపోతరు
మా ఉసురు దాకి ఊడ్చుకపోతరు

*4 అక్టోబర్ 1997*

# ప్రకృతి రహస్యాలు

ఎద నిండ బీడుపడిన మబ్బులను నింపుకున్న
అనూహ్య కాలగమన చక్రంలో
అలసిపోయిన దేహాల చుట్టూ
ఆశల కళ్ళు పహారా కాస్తున్నాయి
అందాల అనుబంధాల సుతారాలు ఆవిరై
రూపాయి చుట్టు గిరికీలు కొడుతున్నాయి
పరిభ్రమణ జ్ఞాపకాల గుంపులన్నీ
గోడకు వేళాడే తేదీల దొంతరలై
మూగబోయిన నా గొంతులు
నగిషీ చెక్కనాలు అవుతాయి
ప్రకృతి-మనిషి
ఆడుతున్న గారడీ ఆటల్లో
పారుతున్న నదుల గుండెల్లో
నులివెచ్చని రక్తాల చెలిమలు ఊరుతున్నాయి
భూమి అంతరాంతరాలలో



ఆకాశం రెప్పలను వేలాడదీసుకొని
వీలునామా రాసుకుంటుంది
అనంతమైన సుడిగుండాలలో
కలలన్నీ ఎడారిదారులై - రహదారులై
నీళ్ళు ఇంకిపోయిన దేహాలన్నీ
కరువు జెండాలవుతాయి
జీవితానికి - కాలానికి కలగాపులగంగా
జరిగే ప్రచ్ఛన్నయుద్ధంలో
మన చుట్టూ అల్లుకున్న ప్రకృతి రహస్యాలు
మన ఉనికినే ప్రశ్నిస్తున్నాయి
మన ఊపిరి చుట్టే పల్టీలు కొడుతున్నాయి.

*వేటినిజం, 1 జనవరి 1998*

# జనపదాల సవ్వడులు

మనం నడవవలసిందే
మనం ఇంకా సుదూర తీరాలవరకు నడవవలసిందే
ఆదటల్ని, అలసటల్ని ఆస్వాదిస్తూ
తడారిన ఎడారి గుండెలోతుల్లో
చెలిమెలు తవ్వుకుంటూ
మనం నడవవలసిందే
నిశీధి నిస్సారపు భూమిపొరల్లో
ఆశల ఆశయాల విత్తులు చల్లుతూ
ఋతువుల సమూహపు సితార తంత్రులు
శృతి తప్పినపుడు
నిలువెత్తు వసంతాల లయలు నాటుతూ
నడవవలసిందే
కాలం రక్కసి శిలపై
భావాల పట్టుసడలింపులో
అల్లుకున్న భావబంధాలని నిర్మించుకుంటూ



హద్దులలో...
అగాధాలలో...
జనం మైదానం పునాదులలో
లేలేత పూదోటల్ని నాటుతూ
సుదూర తీరాలవరకు నడవవలసిందే
మన నడక ఒంటరి ప్రయాణం కాదు
మన నడక...
ఆది మానవుని నుండి
ఆధునిక మానవుని వరకు
అంతర్లీన చైతన్య కరదీపిక
మన నడక...
రెండు ధృవాల మధ్య
రెండు దృశ్యాల మధ్య
పులకరింపుల దిక్సూచి నావికా
మన నడక...
బాల్యం నుండి బాధ్యతల యవ్వనాల
పరంపరాధి పరవశాల వారధి
లయాన్విత రాగరంజిత
నదీ ప్రవాహ తరంగాల వేదిక
మన నడక...
జనసమూహ పదాల
పాదాల సవ్వడుల కలయిక.

*7 జనవరి 1998*
మంజీర కవుల 'ఏడపాయలు'

# మా బాల్యం సున్నిత త్రాసు

మేము అన్నీ ఉన్నా ఎన్నో ఉన్నా
ఖాళీపుటల్లాగే అనాథలం
బాల్యంలో బతుకు బాధ్యతలను మోస్తున్నవాళ్ళం
చదువుల్ని మోయాల్సిన మా లేత భుజాలు
రాయీ రప్పలకు మట్టితట్టలకు భుజకీర్తులయ్యాయి
సిరివెన్నెల చిందించే మా చేతుల నిండా
పానాలు, పటకార్లు మొలుస్తున్నాయి.
ఇరానీ టీ కప్పుల నిండా ఒళ్ళంతా చెమటెక్కిన
మా చేదు కన్నీటి ఆవిర్లే...
అనుక్షణం నరక యాతనల గండాల వెలుగులో
బస్టాండుల్లో, రైల్వే ప్లాట్‌ఫారాల్లో
దుబ్బ చెలకలల్లో పచ్చపచ్చని చేండ్లల్లో
ఫ్యాక్టరీ పొగ గొట్టాల్లో
దిష్టిబొమ్మల ముఖాలవుతాం
మా జీవితాలకు - మరణాలకూ మధ్య
మేము సున్నితత్రాసులం

*ఉపాధ్యాయ, సెప్టెంబర్ 1999*



# మా బాల్యాన్ని హైజాక్ చేయకండి

మేం పుట్టుబానిసలం
కాన్వెంటు సంస్కృతికి బలవుతున్న
మనోవికాస విరజాజులం
మా చుట్టూ అల్లుకొన్న అందమైన ప్రపంచంలో
మా భవిష్యత్తంతా గుదిబండే కదా...
మా రంగు రంగుల ఊహల లోకాల్లో
మేము రోజురోజుకు
కరుగుతున్న మైనంముద్దలం
అమ్మానాన్నా ప్రేమానురాగాల
తేనెచిన్కులు కరువైన
రోబోటు యంత్రాలం
అనునిత్యం
మా మెదడు పొరలను తొలిచే బుల్లితెరే
మాకు చిరుస్వప్నాల సాలీడు
మా మనస్సులకు జీవితాలకు

రూపాయే సాక్షిగా
షోకేస్‌లోని అందమైన బొమ్మలం
మా బాల్యాన్ని హైజాక్ చేయకండి... ప్లీజ్

*ఉపాధ్యాయ, సెప్టెంబర్ 1999*



# దగాపడ్డ తెలంగాణను

ప్రశాంత నిద్రావస్థలో
కంటి రెటీనాపై ఒక సంచలన దృశ్యం
శరీరమంతా గాయాలతో
సలుపుతున్న బాధల మూలుగులతో
చింపిరి చినిగిన దేహంతో
ఎండిన కన్నీటిచారలతో
జీవధార నదులున్న
ఆ గొంతులోని జీర ఆవిరై
కనురెప్పల మీద కత్తులు కాపలా కాస్తున్న చిత్రం
తెలంగాణను దగాపడ్డ తెలంగాణను
భూమిపొరలను తొలచుకొని
మొక్కవోని ధైర్యంతో
మొలకెత్తిన తెలంగాణను
పెద్దమనుషుల ఒప్పందం ముసుగులను చీల్చుకొని
వెయ్యి వేళ్ళ గొంతులను సవరించుకొని
దీన హీన జీవిత పుస్తకాన్ని

పుంఖానుపుంఖాలుగా కరపత్రాలై
ఎగజల్లిన తెలంగాణను
పరాయి ఉక్కుపాదాల కింద నలిగి పోవద్ది
చిలకపచ్చ చీర కట్టినదాన్ని
మెడల నల్లపూస లేకపాయె
చిత్రాల - విచిత్రాల సినిమాల్లో
నా ఊపిరిని ముక్కలు ముక్కలుగా నరకవట్టిరి
గల్లు గల్లున సంబరాలతో
పల్లెల్లో అలాయిబలాయితో తెల్లవారేదాన్ని
పల్లెల్లో తుపాకుల తూటాల లొల్లులాయే
తుపాకుల కంచెలాయే
నిజాం మెడలు వంచిన వీరతెలంగాణను
మాయమాటల అంకెల గారడీలో నన్ను ఆగంజేయవట్టిరి
పసందైన పచ్చని పంటపొలాలు కాజేసి
వట్టిపోయిన బీడుభూములు నా ఎదపై పరచవట్టిరి
బతుకుకు బువ్వపెట్టే తలలను
నా మెడలో హారాలుగా వేయవట్టిరి
కష్టపడే నా కొడుకుల చెమటను
అత్తరుగా రాసుకొనవట్టిరి
ఏమని చెప్పుదు బిడ్డా!
నా కడుపుకోత
నన్ను సందు లేక తూట్లు తూట్లు పొడవవట్టిరి
బిడ్డలారా! ఓ కన్న కొడుకుల్లారా!
ఈ యముల చెర నుండి
నన్ను యిడిపీయండ్రి ఇంక బాధలు పడకున్న
లొల్లి చేయండ్రి, జంగు చేయండ్రి
తెలంగాణ అవ్వను కాపాడుకొండ్రి

*పొక్కిలి, తెలంగాణ కవుల కవితల సంకలనం, 20 డిసెంబర్ 1999*



# ప్లాస్టిక్ టక్కరిజాలం

పాతబిందెలు, గిన్నెలు అతుకుతాం
కళాయి పోస్తాం, గంటెలు చేస్తాం
ఆ అరుపులు ఊరి పొలిమేర్లో ఆవిరైనాయి
వాళ్ళ కాళ్ళు చిరునామాలు లేని రహదార్లు
జీవితాలకు గ్యారంటీ లేని ప్రయాణాలు
ఒకనాడు...
ఆ అరుపులకు
ఊరు ఊరంతా గుమిగూడి
వాళ్ళ కడుపు నింపేది
ఇప్పుడు...
చుట్టూ ఆవరించిన
హైటెక్ సంస్కరణల ప్లాస్టిక్ టక్కరిజాలంలో
చిన్నాభిన్నమైన జీవితాలు
భవిష్యత్తులేని నిరంతరం నిలకడలేని నడక వాళ్ళది
ఒళ్ళంతా కండ్లు చేసుకొని
కళ్ళల్లో బాధల బరువులు మోస్తున్న వాళ్ళు

వాళ్ళకు ప్రతిదినం
చిల్లులు పడ్డ సూర్యుడే దర్శనం
వారి చీకటి బతుకుల్లో
నిండు చంద్రుడు జల్లెడౌతాడు
ఊరవతలి చింతచెట్టు అద్దాల మేడవుతుంది
ఆవిరైన గుండెలతో
మళ్ళీ మజిలీల ప్రయాణమే వారిది

*15 ఏప్రిల్ 2000*



# పాటలు కావాలి

మళ్ళీ మొదలయ్యింది
దేశరంగస్థలంపై
బహురూప ముఖాల భాగోతతంత్రం
అమెరికా అప్పుల సమ్మోహన రాగాలతో
పోటాపోటీగా రంగు రంగుల్ని
పులుముకున్న సర్కస్ ఫీట్లు
మళ్ళీ మొదలవుతున్నాయి
స్వదేశీ బ్రాండ్ కాషాయ పేల్కలు
పసుపు వన్నెల రెపరెపలు
నక్షత్రాల జెండాకు
కుచ్చు కుల్లాలు అవుతున్నాయి
జెండా రంగులు ఎన్నెన్నయినా
ఆలోచనల రొంపంతా ఒక్కటే
స్వర్ణోత్సవాల జాతర పరదాలు
పర్చుకున్న ముసలి నక్కలు
అగుపించని

యౌవన లేపనాలు రుద్దుకుంటున్నాయి
ఎండమావి పొరల్లో వెలుగుజిమ్మే
భారత సార్వభౌమాధికార నాలుగు తలల సింహాన్ని
ఆర్థిక, సాంకేతిక సంస్కరణల డేగలు
మునిగోళ్ళతో తన్నుకపోతున్నాయి
ఇంటర్‌నెట్ టెక్నాలజీ
భ్రమల కుతి తీర్చుకోవడానికి
తెలుగు ఆత్మాభిమానాలు
బిల్‌గేట్స్ ముళ్ళ పాదాలకు తాకట్టులవుతున్నాయి.
ప్రజల చెమట బిందువులు
కడగళ్ళ కన్నీళ్ళు 'సీ వరల్డ్' చిత్రాలయినాయి.
చిగురించే బాల్యాలసాక్షిగా
'డిస్నిలాండ్,' భూతాలు వెంటాడుతున్నాయి.
అంతర్జాతీయ కుబేరుని కనుసైగల్లో
జనం గొంతులకు ఉరులు బిగుసుకుంటున్నాయి
మనం ఇప్పుడు...
సరికొత్త నాజూకైన కత్తుల వంతెనల
సంధికాలంపై నిలబడ్డాం.
మన ఆలోచనా తుఫానులన్నీ ఏకం కావాలి
మనం జీర్ణించుకొన్న అనుభవాలన్నీ
సమూహ గొంతుల సమరం కావాలి.
భవిష్యత్తు చరిత్రపుటల్లో
మన త్యాగాల గొంతులు
జనం పోరాట పాటలు కావాలి.

*మంజీర కవుల సంకలనం 'ఎడపాయలు', 8 అక్టోబర్ 2001*



# యుద్ధాన్ని ఆపలేం

ప్రకృతి తనకు తాను జీవన్మరణాల
సంధికాలం చువ్వపై వేలాడుతున్న వేళ
ముగ్ధమనోహర అందాల పరిమళాలు
ఎడారిలో తప్పుకున్నట్లే గదా
అల్లుకున్న జీవితపు ఆశలన్నీ ఆవిరై
తుఫాను కెరటాలుగా చీలిన భూమి
పొరలు పొరలుగా పొంగి
దారి పొడవున పచ్చదనాల కుత్తుకలకు
అల్లుకున్న తాౖరోడ్డు
తాను గమ్యాన్ని చేరదు - చేరనివ్వదు
చిన్నప్పుడు కేరింతలు కొడుతూ ఈతలీదిన
మెదక్ నాడీ 'మహబూబ్‌నహేర్'
తన చేతులని పాయలు పాయలుగా చీల్చేసుకొని
అలల పాన్పుతో ఆదరించిన 'రంకురాళ్ళ' గుర్తులు
చితికిన కనుగుడ్డైన వేళ

మెదక్ గొంతుల్లో
అమృత జలధారలందించిన
నా వేల స్వప్నాల వింజామరలూపిన
నా పసుపులేరు నా పసుపులేరు!!
రంగు రంగుల అందాల మేడలకు ఊపిర్లూదిన
ఇసుకమేటల నా రతనాల రాశి
ఆకాశంలో విరబూసిన నెలవంక
పసుపులేరు! నా పసుపులేరు!!
ఎవరి పాపమో?! ఎవరెవరి శాపమో?
భోపాల్ విషవాయువులో ఛిద్రమైన దేహంలా
కర్కశత్వపు కత్తులపై సేదదీరిన పసిపాపలా
లేత వయస్సులో
ఐదవతనం కోల్పోయిన అనాధగా
భూకంపంలో చెల్లాచెదరైన స్మశానంలా
నా దేహాన్ని నా ఖడ్గ హస్తాలతో
ముక్కలు ముక్కలుగా చేసుకున్నట్లుగా
అనునిత్యం నా మెదడు నరాల పొరలలో
తెంపర తెంపరలుగా
మాసిపోని గాయాల సాక్షిదృశ్యాలే
కష్టాలని సుఖాలని పంచుకొని
ఆడే బతుకమ్మ ఆటలకు
కన్నీళ్ళే చెరువులైన వేళ
దొంతర దొంతరలుగా పేర్చుకున్న
రంగు రంగుల హరివిల్లులు
ప్రేమానురాగాల బంధాలన్నీ
పుటుక్కున తెగిపడుతున్న దృశ్యాలెన్నో



జీవితానికి - మరణానికీ
ప్రకృతికి - ప్రతీకకీ
అంతరాలలో నిరంతరం సాగే
యుద్ధాల పరంపరలే గదా!
మరణం తప్పించుకోలేని బంధం
సుఖమైనా దుఃఖమైనా
మరణం అంచుల్లోకి తొంగి చూసినా
జీవితాన్ని అచానగ్గా వదులుకోలేం గదా!
యుద్ధాన్ని ఎప్పుడూ ఆపలేం గదా!

*మంజీర కవుల సంకలనం 'ఏడపాయలు', 8 అక్టోబర్ 2001*
*నేటి నిజం ఉగాది ప్రత్యేక సంచిక, 2002*

# కన్నవారి జాడ కోసం

ఈ దేశం ఈ మట్టి
మాదని ఇంకా భ్రమలో బతుకుతున్నాం
ఎంతకాలం బతుకుతామో? ఎప్పుడు చస్తామో?
తారీకులు, సాక్ష్యాలు లేని దస్తావేజులు రాసుకుంటున్న
ఈ దేశ కాందిశీకులం
ఇప్పుడు గుజరాత్‌లో
శంబూకుని తల నరికిన
ఉన్మాద రాజ్యం నీడలో
సమూహంగా ఒక జాతి నిర్మూలన
తెంపర తెంపరలుగా సాగుతుంది
వేదాల నరమేధ హోమజ్వాలలు చెలరేగుతున్నాయి
నసీంభాను, షాజహాను, మునీబాయి
చెదిరిన దేహాల సాక్షిగా
నగ్నదేహాలతో శివమెత్తిన
హిందూత్వ పైశాచికం



ఎగబాకిన సమూహ శరీరాల
చీకటికోణాల సంస్కృతి
త్రిశూల ధారిణియై
జాతి వంశ ధ్వంస రచనలో
నిండు గర్భిణి గర్భం చీల్చి బంతులాట ఆడుతుంది
తల్వార్‌లే కాలమై ప్రణాళికలై
బాంబులై, యాసిడ్ పొడరై
గాంధీ పుట్టిన దేశంలో అహింసా పావురం
గాడ్సే హింసారాజ్య పునాదుల్లో పాతరేయబడి
జ్ఞాపకాలే తోరణాలవుతున్నాయి
ముక్కలు ముక్కలు చేసి పెట్రోలు పోసి తగులబెట్టిన
గుర్తు పట్టని శవాల దిబ్బలలో
ఓ భార్య భర్త మృత శరీరాన్ని
మూటకట్టుకుంటున్న దృశ్యం
ఓ తల్లి తన కన్నవారి జాడకోసం
కనురెప్పలను వీధిలైట్లకు
వేలాడదీసుకుంటున్న దృశ్యం
ఏ చరిత్రలో ఏ ఛార్జిషీట్‌లో రికార్డవుతాయి
'మేశ్వానది' అరణ్యరోదనలో
బాల్యం బలైన 'ఖసీచ్'కు ఏం తెలుసు?
మట్టికి గాలికి మతముంటుందని
ముక్కుపచ్చలారని పసిపిల్లల తలలు
జిమ్మిక్కుల పలకరింపు చేతుల్లో బొకేలవుతాయని
అగ్రరాజ్యాల మీడియా భూతం పంజాకోరలలో
మా శరీరం వదిలిన మలినాలు కూడా వదలకుండా
మతోన్మాద విశ్వాస శునకాల ప్రహారాల్లో

'ఈశ్వర్ అల్లా తేరేనాం' సబర్మతీ ఆశ్రమం
శిరస్సును ఖండించుకొని
సబర్మతీ నదిలో తేలుతుంది
ఎటు చూసినా ఏమున్నది?
అహ్మదాబాద్, నరోరా, బాటియా, కంజరి
బలాల్, కిడియాది, సర్దార్‌పూర్
మొండిగోడల శవాల దిబ్బలా!
స్మశానాల రూపురేఖలే కదా!
గుజరాత్ ఎదనిండా
ధ్వంసమైన హృదయాలే
ఇప్పుడు గుజరాత్‌లో మోడీని
ముక్కోటి దేవతలు ఆవహించి
అస్త్ర శస్త్రాయుధాలతో ఊరేగుతున్నారు

*'గుజరాత్ గాయం' కవితా సంకలనం, 10.6.2002*
*'అజా' మైనారిటీ కవుల కవితా సంకలనం, 2002*



# పట్నం నిండా

వారు శరీరాన్ని ధరించినవాళ్ళే
కానీ
మాటలు హైజాక్ అయినవాళ్ళు
వారి రోదనలు
ఈ మహానగర జనారణ్యంలో
మౌనరాగాలైనాయ్
వారి సైగల చూపులు
చేతి మునివేళ్ళ విన్యాసాలు
గాలికెగిరే కరపత్రాలై పావురాలై
పట్నం నిండా పర్చుకొన్నాయ్

*నేటి నిజం, 11 అక్టోబర్ 2002*

# కాలం

కాలం
ఎంత దయలేనిది
వంద వసంతాలు వికసించే
జీవిత కుసుమాన్ని
లిప్తపాటు కాలంలో
మంచుఖడ్గం మీద వేలాడదీస్తుంది
కాలం...
ఎంత చిత్రవిచిత్రాలది
జీవితాన్ని ఏడ్పుతో మొదలుపెట్టి
ఏడ్పులతో అంతమవుతుంది
కాలం...
ప్రేమలను, స్నేహాలను, అనురాగానుబంధాలను
తన సహస్ర హస్తాలతో కబళిస్తుంది.

*18 అక్టోబర్ 2002*



# ఈ దేశపు తల్లివేరు పాయలం

మేము
ఈ దేశపు తల్లివేరుల్లో పాయలమంటూ
ఈ భూగోళమంత దద్దరిల్లంగ
చాటింపు వేస్తున్నాం
మేము ఎప్పుడూ వేరు అని ప్రకటించుకోలేదు
ఖురాన్‌ను, భగవద్గీతను
రెండు కళ్ళుగా చేసుకొని
'దీన్-ఇ-హిలాహీ'
వెలుగులను నింపుకొని
సూఫీ సడక్‌ల మీద నడుస్తున్నాం
ఈ నేలతల్లి గర్భం చీల్చుకొని
జన్మనెత్తిన వాళ్ళం
గంగా, యమునా, కృష్ణా, గోదావరి
సమస్త నదుల చనుబాలు తాగి
మా దేహాల నిండా ప్రవహించుకున్న వాళ్ళం

'సారే జహాసే అచ్చా
హిందూ సితాహమారా' అని
ఆపాదమస్తకం ప్రణమిల్లిన వాళ్ళం
నాటి ఆజాదీ లడాయి నుండి
నేటి కార్గిల్ వరకు
షహీద్‌లు అయ్యింది మేము కదా
నైజాంకు ఎదురొడ్డి
మా కడుపులు కాల్చుకున్నది మేమే కదా!
ఒరే బద్మాష్
మా గతాన్ని పెళ్ళున పెకలించి
అడ్రసు లేని వాళ్ళను చేస్తున్న
బట్ట బాజీతనాన్ని చూస్తున్నాం
మా విశ్వాసాన్నే వెక్కిరింపుగా
మొండోడనీ, మొరికోడని
ఎకసెక్కాలాడుతావురా
లుచ్చాకే బచ్చా...
మొండితనం మా గుర్తు కాదురా
నీ వాత్సాయనుడు చెప్పిన రంకులాటలకు
ఏ వేదం ఏ శాస్త్రం చెప్పని
శుచీ శుభ్రతల ఆరోగ్యసూత్రంరా
నా రహస్యాంగం

*'నేటి నిజం' గణతంత్ర దినోత్సవ ప్రత్యేక సంచిక, 26 జనవరి 2005*
*'ఉషాకిరణాలు' సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక - ఒంగోలు, మార్చి 2003*
*'అలావా' కవిత సంకలనం, జులై 2006*




# యుద్ధమంటే మానవత్వ గాయాల హారం

విశ్వమంతా విస్తరించిన
ఊడల మర్రిచెట్టు తొర్రలో పుట్టిన
ప్రపంచ పైశాచిక భూతమా!
అణ్వస్త్ర ఆయుధాల దొంతరలను
రెక్కల కింద పొదుగుకొని
నిరాధీకరణ జపం చేస్తున్నవాడా
భూగోళమంతా పర్చుకున్న
విష స్వరూపాల సంతతి వాడా
సామ్రాజ్యవాద మత్తులో
ప్రపంచ ప్రజల రక్తం రుచి మరిగిన
అమెరికా బ్రహ్మరాక్షసీ...
చమురు చుక్కల దాహం కోసం
ఇరాక్‌ను మారణహోమ రణరంగం చేసినవాడా
ఐక్యరాజ్యసమితిని అలంకారప్రాయం చేసి
మదమెక్కిన ఏనుగును అంబారి చేసుకొని
ప్రపంచ శాంతి పావురాన్ని



సప్త సముద్రాలలో పాతర వేసినవాడా
అగ్రరాజ్య అహంతో బుసకొడ్తూ
దాడుల దురాక్రమణ చేస్తున్న యుద్ధోన్మాదికి
యుద్ధమంటే... ఏం తెలుసు?
మానవత్వగాయాల హారమని
యుద్ధమంటే...
డాలరు సంస్కృతిలో బంతులాటే కదా
యుద్ధమంటే...
చరిత్ర, సంస్కృతి వికసించే బాల్యం
బూడిదకుప్పల మయమే కదా!
మిరుమిట్లు గొలిపే మిస్సైళ్ళు

బాంబుల దాడులలో ధ్వంసమైన
బాస్రా, బాగ్దాద్, నసీరియా, మోసూత్, ఇరాక్ నిండా
భయకంపిత బలవంత ప్రసవాల ఆక్రందనాలలో
ఆవిరైన అమ్మతనాన్ని ఎవరు ఇస్తారు?
గాయపడ్డ సుకుమార బాల్యాలను
తెగిపడ్డ భవిష్యత్తు తలలను
కన్నతల్లు కడుపుకోతలను
ఏ పునరావాసం పునరుద్ధరిస్తుంది
తన నేలపై తననే పరాధీనుడిని చేసి
తన చేతి పంటను ధ్వంసం చేసి
సహాయ ఆటవిక నాట్యం ఎన్నాళ్ళు - ఇంకెన్నాళ్ళు?

ఈనాడు ఇరాకే బలిపశువు కాదు
సిరియా, టర్కీ, కువైట్, భారత్
కబళించే కత్తుల రాడారు నుండి తప్పించుకోలేవు





సంపన్న సంకర శ్వేత వస్త్రాల కువైట్
నెలవంక సాక్షిగా
నీ సోదరుని ఎదపై నిలబడి
యుద్ధరంగ స్థలమైతావా?
నీవు విశ్వసించే అల్లా నిన్ను క్షమించకుండుగాక... అమీన్
శాంతి, ప్రేమామయుడైన యేసు
జార్జ్‌బుష్, టోనీబ్లేయర్ కబంధహస్తాలలో చిక్కి
అహంకార వధ్యశిలపై
మళ్ళీ సిలువ వేయబడ్డ ఓ కరుణామూర్తీ
ఓ దయగల ప్రభూ
సర్వజనులు ప్రేమ శాంతి సుఖాలతో
జీవించునట్లు దీవించుడు... ఆమెన్

ఓ భారత సార్వభౌమ కిరీటిధారీ
ఒప్పులకుప్ప ఒయ్యారాలెందుకు
ఒంటి నిండా అప్పుల రక్తం పారించుకున్నవాడా
వైట్‌హౌజ్ చుట్టూ పరిభ్రమించేవాడా
ఇంకా నంగనాచి మాటలద్దు
దాగుడుమూతల గుసగుసలద్దు
అప్పుల ఒప్పందాల వారధులు వద్దు
మనం కూడా ఎప్పుడో ఒకప్పుడు
అమెరికా బలిపీఠమ్మీద బలి కావల్సిందే కదా!
మనస్ఫూర్తిగా యుద్ధాన్ని వ్యతిరేకించడమా
యుద్ధోన్మాదులతో మౌనంగా జత కలిపి
ప్రపంచచరిత్రలో కళంకిత అక్షరాలవుదామా?
నిగ్గు తేల్చుకోవలసింది ఒక్కటే

*3 ఏప్రిల్ 2003*



# భయకంపిత పావురాలం

వేలవేల సంవత్సరాల
స్వాప్నిక సౌధాలు కూలాయి
పరుగెత్తండి!! పరుగెత్తండి!!
భారత లౌకిక రాజ్యాంగము తగలబడ్తుంది
పరుగెత్తండి! పరుగెత్తండి!!
ముఖాలకు మాస్కులు వేసుకొని
మరీ పరుగెత్తండి
సబర్మతీ ఆశ్రమంలోని మహాత్ముడు
రథయాత్రల కాషాయజెండా కొయ్యకు
ఉరి వేయబడ్డాడు
మళ్ళీ రెండు నిముషాలు మౌనం పాటించండి
డిసెంబర్ 6 ఒక కుట్ర
ఒక కుతంత్రం
దుర్మార్గం
కాషాయం రగిల్చిన కిరాతకం




ఇంకా వెంటాడుతూనే ఉంది
మా కాళ్ళ కింది భూమిని
తెప్పలు తెప్పలుగా తవ్విపోసి
మా అచంచలమైన విశ్వాసాలను
ఖండఖండాలుగా పాతివేయబడుతున్న వాళ్ళం
మా ఇంట్లోనే
మేము భయకంపిత పావురాలమవుతున్నాం
ఎన్నో రాత్రుళ్ళు, పగళ్ళు
మా అంత మేము గృహనిర్బంధ శిక్షను
అమలు చేసుకుంటున్నవాళ్ళం
పరస్పర పలకరింపులు లేవు
పదునెక్కిన పైశాచిక కాషాయపు
త్రిశూలాలు దూసుకొస్తాయో
యాసిడ్ బాంబులు ముఖాన్ని మోటుగా ముద్దాడుతాయో
భయం! భయం!!
అంతా భయప్రకంపనలే

*'ముల్కీ' ముస్లిం సాహిత్య సంచిక, 10 జులై 2004*
*'అలావా' కవిత సంకలనం, జులై 2006*



# బహురూపుల నాటకం

ఎన్ని రంగస్థలాలు మారితే ఏమున్నది?
పాట పాతదే ఆట పాతదే
మన మెదళ్ళను ఉరికొయ్యలకు వేసి
మనస్సులను శిలువ చేసుకోవడమే కదా!
దేశాభివృద్ధి మెరిసే మేడిపండే కదా!
ఎండి పగులిడిన దిబ్బలలో
'హరిత విప్లవం' నినాదాలు కాంక్రీటు గోడలై
పల్లెల పతనాల చిత్రపటాలు
'ఫ్లై ఓవర్' పునాదుల్లో పూడ్చిపెట్టడమే కదా?!
ప్రపంచ మాయలోడు మంత్రించిన
ఖండాంతర ఎయిడ్స్ భూతం
ఉపఖండాన్ని ఆవహించితే
ఖజానా ఖాళీ ప్రచారాల భేరి అవుతుంది
నివారణకు ముష్టి జలజల రాలుతుంది
ఇక్కడ ఏం జరిగినా...
అద్భుత సంగీత కచేరీలవుతాయి.





పార్లమెంట్ గల్లీలలో, అసెంబ్లీ హాలులో
అప్పులిచ్చే అధినాయకుని విగ్రహ ప్రతిష్టాపనల ఉత్సవాలు
ఐ.టి. పారాయణ పురాణ కాలక్షేపాలు జరుగుతాయి
ప్రసన్నం కాని జిత్తులమారి వరల్డ్ బ్యాంక్ దేవుడు
మనుషుల పుట్టుకల మీద
పేటెంటు హక్కు నాకే కావాలంటాడు
ఇక్కడ ఏం జరిగినా అంతా మిథ్య
అప్పుల అభివృద్ధి అంచనాలు
లెక్కల గారడీల వైఫల్యాలు అయితేనేమి
అధినాయకుని కుర్చీ విరిగిన కలలు అయితేనేమి
కనుపించని నాలుగో సింహం తల మాయమైతేనేమి
ఉగ్రవాదం, తీవ్రవాదం, విదేశీ కుట్రలు ఒకే ఒక మంత్రమై
అధికార శాసనాల ఎజెండా అయి
విశ్వమంతా జెండాగా ఎగురుతుంది
ఇక్కడ అంతా భ్రమ! అంతా కర్మ!!
ఇక్కడ అంతా బహురూపుల నాటకం!!

*ప్రజాసాహితి, జనవరి 2004*



# జర పయిలం బిడ్డా!

జర పయిలం బిడ్డా, గాడచ్చిండు
గాడు పరికికంప సంస్కృతి పగటి ఏశగాడు
ఇజ్జతు లేని ఏశాలకు అరసుడు
ఆడు దునియా అంత పర్చుకున్న జంతర్‌మంతర్‌గాడు
జర పయిలం బిడ్డా గాడచ్చిండు
గ్లోబలైజేషన్ గమ్మత్తయిన
ఆటల పాటలతో తాలం ఏస్తే
గీడు పెయ్యి మరిచి పెయ్యి మీది బట్టల్ని పీలికల్ని చేసి
సరికొత్త డ్యాన్సులు జేస్తున్నాడు
ఉల్లిపొరల బట్టల ప్రకటనలై
బట్టలే బరువైన శరీరాలై
గుట్కాల శెదపురుగై
సత్తువ జచ్చిన అవులాగాళ్ళను జేస్తూ
వయస్సు పోరగాళ్ళను పిచ్చిపాటల కేరింత సప్పుళ్ళతో
ఒణుకుడు రోగాలు తెప్పిస్తున్నాడు
సైతాన్ ఛానళ్ళతో మనకు సోయి లేకుండా చేస్తున్నాడు





జర పయిలం బిడ్డా! గాడచ్చిండు
రెండు అనురాగాల మధ్య మాటలను కరువు జేసి
మమకారాల పేగుబంధాన్ని ఛిద్రం జేసి
గాడు డాలరు దశావతారాలు ఎత్తి
ప్రపంచ అంగట్ల మీద రూపాయి కొసర్లు ఏస్తున్నాడు.
జర పయిలం బిడ్డా! గాడు ప్రపంచ పెనుభూతంగాడు
ఆడు ఇసిరే మాయాజాలంలో
మనం మనుషులమేనా? జర గిచ్చుకోని చూద్దాం!
మనకు ఖయాలు ఉందో లేదో మెదడు ఉందో లేదో
జర పుర్రెను గెలుక్కొని సూద్దాం!
గాడు అన్నీ మాట్లాడి, మనల్ని మాట్లాడకుండా జేస్తాడు
మొసలి కన్నీళ్ళ రాతలు రాసి,
మనల్ని రాయకుండా జేస్తాడు
వాళ్లె వీళ్లె గోత్రాలు ఒక్కటే
గాడు కాళ్ళకు గజ్జలు గడితే
వీళ్ళు కొన ఏళ్ళ మీద నాట్యం జేస్తారు
జర పయిలం బిడ్డా
ఆడు అంతటా పర్చుకున్నాడు
అదను చూసి ఆయువుపట్టు పట్టాలే
దెబ్బ మీద దెబ్బ కొట్టాలే.

*నేటి నిజం, 8 జనవరి 2004*



# భారత్ వెలిగిపోతుందా?!

ఇండియా షైనింగ్? ఆహాఁ... ఆహాఁ...
భారత్ వెలిగిపోతుందా? హీ... హీ... హీ... హీ...
ఎంత దగుల్బాజీతనం
బుడ్డర్‌ఖాన్ ఊకదంపుడు ఉపన్యాసాలకు
హిమాలయాలు కరిగి
ఓట్ల నదులు ప్రవహిస్తాయా?
షైనింగ్ కళ్ళద్దాల ఆటగాడా! మోసగాడా!
నీ గిల్లికజ్జాల రథయాత్రకు చెదలువట్టా
నా తెలంగాణ పాదాల కాడ నిలబడి చూడు
నెర్రలు బారిన నా తెలంగాణ భూతల్లి ఎదలనడుగు
అదృశ్యమయిన బోరు బాయిల ఊటలనడుగు
దూపదీరని పాలపిట్టలనడుగు
గడ్డి మొలవని చెలకలనడుగు
కల్లంలోని గింజల కోసం వచ్చే ఊరపిచ్చుకలనడుగు
ఓ షైనింగ్ కళ్ళద్దాల ఆటగాడా! పాటగాడా!
కుట్రల సుడిగుండంలో ఎండిన కాలువల నడుమ





వాగుల నడుగు! వంకలనడుగు!!
పాతరేయబడిన పంటలనడుగు!
తగలబడిపోతున్న రైతుల ఊపిర్లనడుగు
రైతుల నెత్తుల మీద అప్పుల కిరీటాలనడుగు
నిద్రలో కలలు కనే కీర్తనకారుడా!
అభివృద్ధి అంచున వేళ్ళాడుతున్న ఆత్మహత్యలనడుగు
త్యాగాల దారుల్లో ఎర్రబడిన
అడవినడుగు ఆకులనడుగు
నా తెలంగాణ పల్లె కళ్ళు తెరిస్తే
నీ షైనింగ్ పరదాలు చీలికలు పేలికలైతాయి.

*15 ఏప్రిల్ 2004*



# కాలం ఖడ్గం మీద

సమస్త భూమండలానికి
కాలం ఖడ్గం మీద
శత్రువుగా నిలబడ్డవాడ్ని
ఈ భూగోళంలో ఎక్కడ గాయమైనా
గాయపడేది నేనే
సెప్టెంబర్ పదకొండు వెంటాడుతూనే ఉంది.
నా మతం ఆనవాళ్ళు
నా ఆర్థిక జీవనం
నా వంశక్రమం
నేను పెంచుకున్న అందమైన
స్వప్నాల పూలతోట
ధ్వంసం!
దహనం!!
లూటీ - లూటీ!!
కాటు వేయబడ్డ శీలం
గుర్తు తెలియని శవం



కలసి ప్రాక్టీసు చేసిన క్రికెట్టు
ఇవ్వాల...
ఆట అంటరానిదైపోయింది
ఆలింగనం చేసుకున్న చేతులు
చప్పట్లు కొట్టిన చేతులు
నన్ను తగలబెట్టడానికి
సందుల్లో మూలమలుపుల కాడా చౌరస్తాల కాడా
పకడ్బందీగా ప్లాను వేసుకుంటున్నాయి
నా ఉనికిని...
నాకై నేను మార్చుకొని
కాషాయ తలపాగ చుట్టుకొని
నా రక్తాన్నే తిలకంగా చేసుకున్న
నేను మార్చుకోలేని నా మర్మాంగమే
నా మరణం అవుతుందని
నాకేం తెలుసు?
అభద్రత అలజడులలో
మనిషిలో తడి ఎక్కడ?
వేడి తప్ప

# ఆనవాళ్ళు లేనివాళ్ళం

రంగు రంగు జెండాల ప్రణాళికలకు
ఎన్ని పథకాల పూలు పూసినా
రోష్నీ కోల్పోయి
చితికిన కనుగుడ్ల తోరణాలమే కదా
మేం
అప్పుల చిట్టాలలో భవిష్యత్‌కు
గిరివిబడ్డ బతుకులు మాయి
హైటెక్కు జిమ్మిక్కులలో
ప్రపంచీకరణ జూదం ఆటలలో
చినిగిన దుపట్టాలం మేం
మా ఉనికి...
మొఖంచాటు పరదాల వెనుక
కన్నీటిబొట్ల సముద్రాలం
శిథిలమైన మొండిగోడల హవేలీలలో
సూర్యుని వేడి బాణాలకు
రాలిపడుతున్న వలస పక్షులం





ఈ దేశం నిండా మా అడ్రస్
డబుల్‌రోటీలు, పల్లీలు
చుడ్వా బండీలు, చాయ్ హోటళ్ళు
మెకానిక్ షాపు పంజరాలు
దహేజ్ సుడిగుండాలలో సమిథలై
నిఖాలు చెయ్యని బద్‌నసీబ్ జిందగీలతో
అరబ్బు షేకులకు అమ్ముడవుతున్నది
మా బిడ్డలే కదా?
అరేక్‌మాల్ సలీంబాయి పాన్‌డబ్బా పాషాబాయి
మేము ఎవ్వరికీ కానరాని
అదృశ్య పైగంబరులం

మన ఒంటి నిండా గాయాలు చేసి
మన శిరస్సుకు మైనారిటీ మేకు కొట్టి
నక్కజిత్తుల రాజకీయాలతో
పావులమవుతున్నది మనమే కదా!
మన విశ్వాసాలను పాతరేసినా
చీదరించినా, ఛీత్కరించినా
ఖుర్బానీ అయ్యేది మనమే
జనాభా లెక్కలలో గల్లంతైన శాల్తీలం
దేశద్రోహ జాబితాలో
తొక్కుడుబండ శరీరాలం
ఆనవాళ్ళు లేని వాళ్ళం
ఏ ఆనవాళ్ళని చెప్పాలి?

*ప్రజాసాహితి, నవంబర్ 2004*



# ఏడిండ్లకొక్క దీపం

ఇప్పుడు పల్లెలు
పాడుబడిన గడీ గోడలకు
ఆనవాలు లేని శవాల్లా వేళ్ళాడుతున్నాయి
మట్టి ఎదల నుండి నిక్కి జూసే
గరికపూల పరవళ్ళు లేవు
ఊరు ఊరంతా తానమాడే చెరువులు
బీడుపడి బేషరమ్ చెట్ల తోటలవుతున్నాయి
ఊరంత లొట్టలేసే పరక శాపల జాడలు లేవు
చేదెక్కిన బతుకు పెదాలపై
తీపి చినుకుల సీతపల్క పండ్లు లేవు
పల్లె గుండెల్లో చెమ్మలెండి
పట్నం రోడ్ల మీద చెరువులవుతున్నాయి
ఇంకా ఈడ మిగిలిందేముంది
ఏ నోట మాట విన్నా
సద్దీ సామాన్లు సదుర్కుంటున్న మాటలే
కళ్ళల్ల కన్నీళ్ళ మూటలు కట్టుకుంటున్న





చేతుల సప్పుల్లే
పల్లెలకు పల్లెలన్నీ
వలసపక్షుల వలపోతలవుతున్నాయి
ఇంకా ఈడ మిగిలిందేమున్నది?
ఏడిండ్లకొక్క దీపమే కదా...
ఆటలు, మాటలు, పాటలు పండు వెన్నెలలో ఆవిరై
ఆంధ్ర వలస దోపిడి బంతులాటలకు
తెలంగాణ పల్లెలలన్నీ క్రీడా మైదానాలై
కరువు ఎగబోసుకున్న
ఏడ్పుల శాపనార్థాలవుతున్నాయి
ఇంకా ఈడ మిగిలిందేమున్నది.

*తెలంగాణ రచయితల వేదిక- 'సోయి', 26 సెప్టెంబర్ 2004*



# భూమి అంటే అస్తిత్వం

భూమి...
అధికారం ఆధిపత్యాల యుద్ధోన్మాదం
సూది మొనంత భూమి ఇవ్వని
మహాభారత యుద్ధం
ద్రావిడుల నుండి ఆర్యుల
భూ ఆక్రమణల రామాయణం
అగ్రవర్ణాల వైదిక అణచివేతల నుండి
శిరమెత్తిన చార్వాకం
సామ్రాజ్యకాంక్షల కళింగ యుద్ధం
కోరికలను జయించిన బౌద్ధక్షేత్రం
రవి అస్తమించిన రాజ్యాధికారాన్ని
ధిక్కరించి గడగడలాడించిన రణం
భూమి...
కొమురం భీమ్ పిడికిలెత్తిన
ఆదివాసుల పోరాటాల కెరటం
దొరల చెరల నుండి భూమిని విముక్తి చేసిన





తెలంగాణ సాయుధ పోరాటం
భూమి అంటేనే అస్తిత్వం
అస్తిత్వ పునాదులకే నిరంతర యుద్ధం
భూమి...
అక్షాంశాల, రేఖాంశాల
ఊహారేఖల గోళం కాదు
సజీవంగా కదులుతున్న
జీవన పరిణామాల సమాహారం
బీడు మైదానాలలో
రైతన్నల గుండె చప్పుళ్ళై
పచ్చని జెండాలై మొలకెత్తిన హరితవనం
కష్టాల కుంపటిలో ఓదార్చే
చల్లని వాగువంకల చెలిమల ఊట
భూమిపొరలపై నిలబడి
ఆకాశం వైపు ఎదురుచూపుల పేగుబంధం
సమస్త అవయవాల చలన సమూహం
భూమి...
ఆది మానవునికి ఆలంబనగా
ఆధునిక నాగరికతకు తొలిబాట
ఊరూర ఎగిసిపడే భూ విముక్తి
పోరాట యోధుల చేతుల్లో ఆయుధం
పేదప్రజల స్వప్నాల రాజ్యాధికారం
ప్రజా ఉద్యమాల ఎజెండాల డిమాండ్లై
శతకోటి సూర్యకాంతుల వెలుగులతో
రెపరెపలాడుతున్న జెండా
భూమి...



ఆకుపచ్చ ఆకాశంలో
పసిపాపల బోసి నవ్వులు కావాలి
కబ్జా కబంధహస్తాల
ఏకఛత్రాదిపత్యాల సంకెళ్ళ నుండి
నిత్యం చెమటతో తడిపే కర్షక కరాల్లో
స్వేచ్ఛగా ఎగిరే పావురం కావాలి.

*నేటి నిజం, 25 నవంబర్ 2004*



# నీ మరణం కూడా వీరత్వమే

షాల్యూట్ అరాఫత్! షహీద్ అరాఫత్!
పాలస్తీనా విముక్తి పోరాటాల వేగుచుక్క
నిలువెత్తు గాయాల స్ఫూర్తిప్రదాత
అమెరికా, ఇజ్రాయిలీ జాతీయదురహంకార
ఎత్తుగడల దాడులకు
మొక్కవోని ధైర్యసాహసాల సింహగర్జనల ప్రతిబింబమా
శాల్యూట్ అరాఫత్! షహీద్ అరాఫత్!
నీ తెగింపుల రణరంగాల నీతి
నీవు చిందించే చిరునవ్వుల శాంతి సందేశం
సామ్రాజ్యవాద పీడితుల చేతిలో ఆయుధమై
అనంత ఆకాశవీధుల్లో 'ఫతా' అయి ఎగురుతుంది
శతఘ్నులకు ఎదురు నిలిచిన
రమాల్లా, గాజా నగరాల సాక్షిగా
పొత్తిళ్ళను పిడికిళ్ళుగా మార్చుకొని
ఎదురుచూస్తున్నది జెరూసలెం
శాల్యూట్ అరాఫత్! షహీద్ అరాఫత్!

నీ స్వప్నం వసంతంలా చిగురిస్తుంది
పాలస్తీనా విముక్తి పథమై
విరాజిల్లుతుంది
నడుస్తున్న చరిత్రలో పోరాటాల కాలాగ్నులలో
రగులుతున్న స్వతంత్ర పాలస్తీనా మట్టి
'ఒక చేత్తో తుపాకి
మరొక చేత్తో శాంతి
శాంతిని జారవిడవకండి'
శబ్ద తరంగాలు
ప్రపంచ వలస విముక్తి ఉద్యమాలకు ఆయుధం
శాల్యూట్ అరాఫత్! షహీద్ అరాఫత్!
ఓ స్వాతంత్ర్య స్వాప్నికుడా
సవాలక్ష ఇజ్రాయిలీ దురంతాలను
ఎదుర్కొన్న ఉక్కు సంకల్పాల నిధీ
శతకోటి పాలపుంతల సమూహం నీ త్యాగం
పాలస్తీనా మట్టిని ముద్దాడి తుపాకి పట్టిననాడే
మరణాన్ని ఒక భుజానికి వేలాడదీసుకున్నవాడా
రమల్లా నగరం చుట్టూ వలస భూతాల పహారాలో
నీ మరణం కూడా పిరికిపందలకు సవాలే.

*14 నవంబర్ 2004*





# ప్రాణహిత ప్రవాహాలవుదాం

ఎన్నో వసంతాలు విరబూయాల్సిన జీవితం
బాల్యంలోనే...
గుండె దీపం ఆరిపోతే
ఎన్ని విషాదాంత యుగాలో కదా!
కళ్ళల్లో ఆశల ఒత్తులు వేసుకొని
ఎదురుచూసే ముఖాల నిండా
దుఃఖ సముద్రాలే కదా!
పురివిప్పి నాట్యమాడే బాల్యంలో
చిగురించే స్వప్నాలు
ఆకురాలు కాలమైనప్పుడు
కోటానుకోట్ల తరంగాలను
ఊపిర్లుగా పీల్చడం కూడా కష్టమే కదా!
రాలిపోయే చిన్ని కూనలకు
రెండు కన్నీటి చుక్కలవుదాం
ఆరిపోయే హృదయ కాంతులకు
మన మనసుల కంచెలు నాటుదాం



మానవీయ పుంజాలను పురివిప్పనిద్దాం
మమతానురాగాల వారధులవుదాం
ఎదిగి వికసించే తురాయి పూలకు
చెదరని చెలిమెలవుదాం
ప్రాణహిత ప్రవాహాలవుదాం

*నేటి నిజం, 22 ఏప్రిల్ 2005*



# మేము నవాబులం కాదు

మేము ఈ దేశపు మూలవాసులమే
ఒక వర్గం ఈసడించుకుంటే
ఆదరించిన నీడలో చేరినాం
మా జిందగీలు ప్రచ్ఛాయలుగానే మారాయి
మాలోని ఆధిపత్య అగ్ర బ్రాహ్మణీయ
పదఘట్టనల కింద నలిగినవాళ్ళమే
పెనం నుండి పొయ్యిలో పడ్డా మా చరిత్ర పుటలు
చరిత్ర కాలేకపోయాయి
వీడు దరిచేరనీయడు
వాడు అక్కున చేర్చుకోలేడు
రెంట చెడిన రేవడయ్యింది మా ఉనికి
మా తాత ముత్తాతలు మతమైతే మారారు కానీ!
మా జిందగీలు మారలేదు
నవాబుల మతమైనాం గానీ
నవాబులం కాలేకపోయినాం

మేము నవాబులైతే...?
చివికిన గోనె సంచుల పరదాల
ఎక్కిరింపులెందుకుంటాయి?
మా వాకిట్లో దరిద్ర దేవత నాట్యాలెందుకుంటాయి?
చిల్లులు పడ్డ బురఖాల చాటున
నలిగిన ఎముకల గూళ్ళెందుకుంటాయి?
నవాబు కిరీటం కలికితురాయి
మార్వాడి కొట్టులో గిర్వి ఎందుకుంటుంది?
ధనకామాంధ షేకుల కబంధ విశ్వాసాలలో
మా బిడ్డల మూలుగులెందుకుంటాయి?
మేము బతికిచెడ్డ జెండాలా రెపరెపలాడుతున్నాం
నరాలు తిత్తులుగా చేసి రిక్షాలాగే వాళ్ళం
సూర్యుని గొడుగు కింద అరేక్‌మాల్ అమ్మేవాళ్ళం
అగ్గిసెగల మీద రాళ్ళుకొట్టే వాళ్ళం
మెకానిక్ షాపు డీజిల్ మరకల్లో మునిగినవాళ్ళం
మాలిన్యాల దూదేకి పరుపులైనవాళ్ళం
గడియారపు ముల్లులలాంటి మా కాళ్ళకు
ప్యాచ్‌వఖ్త్ నమాజ్ కోసం ఫుర్సత్ ఎక్కడిది?
ఈ ఏకసూత్రమే విభజనరేఖ దిగువన ఉంచబడ్డవాళ్ళం
'నమాజ్‌కో నహీ ఆత సాలా కాఫీర్ హై ఉన్' అనే
పెళ్ళపెళ్ళలుగా విరగబడే పైశాచిక మాటలు
నా నుదిటి మీద తల్వారై వేలాడుతుంది
ఖురాన్‌లోని సర్వ సమానత్వపు
సూరాలు అపహాస్యమైనపుడు
నా మూలం వెంటాడుతున్నప్పుడు
నమాజ్‌లు ఫాతెహా సూరాలు ఎలా చదువగలమూ?



రోజాఁ ఇఫ్తార్ విందుల పసందులు మాకెక్కడివి?
మాకు రోజా రోజాఁలే కదా!
మేము వాళ్ళతో పోటీపడే నవాబులం కాదు
రోడ్లపై రోలర్ జిందగీలే కదా మాయి
మేమూ ఈ దేశవాసులమే
మా హక్కుల వాటా మాకివ్వండి

*'ఖిబ్లా' ఇస్లాంవాద కవితా సంకలనం, జూన్ 2006*

# వరల్డ్‌బ్యాంక్ చూపుడువేలు

రాజు వాడే దళారీ వాడే
అమ్మేవాడు వాడే - కొనేవాడు వాడే
భూమిని మాయం చేసేది వాడే
పేదవాని ఆకలిని వ్యాపారం చేసి
త్రిశంకు స్వర్గంలో నిల్చే చమత్కారి వాడే
భాగ్యనగరం చుట్టూ
ఆంధ్ర పాలకుల కంచెలు నాటడం ఒక కుట్ర
మాగాణి తెలంగాణకు మట్టి లేకుండా
చేయడం ఒక కుట్ర
తెలంగాణ జీవ సంస్కృతి సమ్మేళన నగరాన్ని
స్టార్‌హోటళ్ళ కాంక్రీటు స్మశానాలుగా మార్చడం ఓ కుట్ర
పచ్చని పంటచేళ్ళకు
ఔటర్ రింగ్‌రోడ్డు ఉరితాళ్ళను
వేలాడదీయడం ఒక వ్యూహం
రైతును కూలీని చేసి కూలీని





అభివృద్ధి అంచున చురకత్తులను దించె
నవ్వులు ఒక కుట్ర
వాగ్దానాలన్నీ వానరాని మబ్బులైనపుడు
అధికారం నాలుగు తలల నాగవుతుంది
ప్రశ్నించే కలాలకు
హైద్రాబాద్ ఒక కుట్రకేసవుతుంది
కోబ్రాలై వెంటాడి వేటాడుతుంది
సల్వాజుడుంతో సై అంటుంది
అడవిని అనాథను చేసే కుట్రవుతుంది
మల్టీనేషనల్ కంపెనీ అక్కున చేరి
గ్రీన్‌రూమ్‌లో గుసగుసలాడుతుంది
మిఠాయిల పంపకాలంత ఈజీగా
భూమి, నీరు, గనులు పంపకాలైపోతాయి.
గ్లోబలైజేషన్ గొడుగు కింద
వరల్డ్ బ్యాంక్ చూపుడువేలవుతుంది

*జూలై 2006*



# మ(రిచెట్టు

**నా** బాల్యానికి సాక్షిగా
మార్కెట్టులోని మ(రిచెట్టు నీడ
శు(క్రవారపు అంగడికి
పచ్చని గొడుగైన ఏ.సి.
కమిలిన మనసు గాయాలకు
మాటల ఊరటలైన గుర్తులు
పాన్‌డబ్బా నా అడ్డ
నరకబడిన మ(రిచెట్టు
యాదికొచ్చిన నా చిన్ననాటితనం
ముక్కలు ముక్కలై ఏడుస్తుంది
అక్షరాలకు దూరమైనపుడు
అక్కున చేర్చుకున్న హాస్టల్‌లో
తిరిగి తోడుకున్న అక్షరమైనాను.
జ్ఞాపకాల మజిలీలలో
పారేసుకున్న బాల్యం



పొయ్యి మీద రొట్టెపెంకైతే
ఎదిగిన జీవితపు మనాదిలో
ని(దకు రెక్కలొచ్చిన రా(తుళ్ళు ఎన్నో-

*(కీ.శే. ఆకుల నర్సింలుగారి యాదిలో)*

*17 మే 2005, అర్ధరా(త్రి 2.30*

# పానాది

**నా** పల్లె పానాది
తొలకరి చినుకులకు
అటూ ఇటూ ఆకుపచ్చ చేతులెత్తి
రంగు రంగు పూల రవికల్ని తొడుగుతది.
కట్లపూల హారాలు తొడిగి
గునుగుపూలతో గుసగుసలాడే పల్లె పడుచవుతది
పెండ్లి చేసి అత్తగారింటికి సాగనంపే
పెద్ద ముత్తయిదువ కాలి అడుగవుతుంది
ఆలమందల అడుగుల చప్పుళ్ళకు
మేకపిల్లల దుంకులాటలకు గజ్జెలమోతై
రేగిన దుమ్ముల్లల్ల హోళీ పండగవుతది
నా పల్లె పానాది
సద్దుల బతుకమ్మ పండుగకు
తంగేడుపూల తానమాడుతది
దసరా జమ్మినాడు జొన్నకర్రల ఊరేగింపవుతది



బోనాల పండుగకు ఊరడమ్మ కొలుపైతది
బొడ్రాయి కాడ బొట్టైతది
అసోయి దూల పీర్ల పండుగకు
అలావా గుండంలో అగ్గైతది
దూల ఆటలకు డప్పుల దరువైతది
కష్టసుఖాలలో ఎగిరే పావురాల మతులబై
చావు పుట్టుకలకు మరుపురాని గుర్తవుతది
పాల్లోల్ల పంచాదై
ప్రేమలను పంచిన తాతలా సంచరిస్తది
యాడాదంత పడ్డ కష్టానికి
ఇంటికి చేరే బండ్ల బాటైతది
మార్కెట్ అవతారాలెత్తి
తరలించుకపోయే నీళ్ళధారలకు
చెమ్మలింకిన పానాది తెలంగాణ గుండె ప్రతిబింబం
కపట వేటగాని బాణాలకు
నేలకొరిగిన గొర్రెంకల చూపులకు
డాంబరు తోవలన్నీ ఇనుపకంచెలైనప్పుడు
పానాదులన్ని పాటలై నినాదాలై
అచ్చంతపూల బతుకుదండలై
ఆలింగనం చేసుకుంటాయి.

*23 అక్టోబర్ 2006, మబ్బుల 3.30*